When the plural termination లు is added some words ending in ను and యి drop them.

| | | |
|---|---|---|
| చేను | field | చేలు |
| పేను | louse | పేలు |
| మీను | Fish | మీలు |
| రేయి | Night | రేలు |
| రాయి | Stone | రాలు |

(రాళ్ళు is also used)

The following words drop the final letters optionally before the plural termination లు.

| | | |
|---|---|---|
| ఆవు | (cow) | ఆవులు, ఆలు |
| జాము | three hours | జాములు, జాలు |
| చుట్టము | (relation) | చుట్టములు, చుట్టాలు or చుట్టలు |
| మీసము | | మీసములు, మీసాలు, మీసలు |

## WORDS DENOTING TIME

ఎల్లుండి day after tomorrow

నిన్న yesterday నేడు today

మొన్న day before yesterday

## NOUNS

వయస్సు N Age విత్తనము N Seed

Pronouns

ఎన్ని How many

ఇన్ని So many కొన్ని Some

నేడు ఆదివారము.

మా ఇంటికి చుట్టాలు వచ్చెదరు.

మా తమ్ముడును చెల్లెండ్రును వారికొరకు చూచుచున్నారు.

మా తమ్ముని వయస్సు ఆరు ఏండ్లు.

మా చెల్లెలి తలలో పేలు ఉన్నవి.

మీ ఆవులు ఎన్నిపాలు ఇచ్చును?

అవి నూతి నీళ్ళు త్రాగునా?

నిన్న మాచేలలో విత్తనములు చల్లినారు.

మా అయ్య రెండు జాములకు ఇంటికి వచ్చును.

ఆయన కాలిలో ముళ్ళు విరిగినవి.

Tomorrow is Monday.
The monkey bit my younger sister with its teeth.
My uncle has two houses in the village.
There were nine thousand bowmen in the Kakatiya army.
Day before yesterday I saw two hunters.
There were two bows in their hands.
How many wooden pounding rods are there in your house?
My sister-in-law and the wives of my younger brothers are taking out stones in the rice.
My father bought three sickles yesterday.

———

# 8th Day

## THE IMPERATIVE MOOD

A verb in the Imperative Mood expresses command, request or prayer.

ము and డు are added to the roots in the Singular and Plural Nnmbers respectively in the Imperative Mood.

When request is denoted అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, అయ్య or అమ్మ are added to ము and డు, చేయుమా, చేయుడీ, చేయుమయ్య, చేయుమమ్మ. అయ్య and అమ్మ are optionally added to them in the Masculine and Feminine Genders respectively డు and ము are optionally changed into వు and రు respectively when అమ్మ or అయ్య are added. This change is compulsary when ఎ or ఏ is added.

Before వు and రు the final ఉ of the roots is changed into అ

| | |
|---|---|
| చేయుము | చేయుడు |
| చేయుమా, చేయుమీ | చేయుడీ |
| చేయవే | చేయరే |
| చేయవయ్య | చేయరయ్య |
| చేయుమయ్య | చేయుడయ్య |
| చేయవమ్మ | చేయరమ్మ |
| చేయుమమ్మ | చేయుడమ్మ |

The చ of roots పిలుచు and నిలుచు is optionally dropped before ము and డు. When this change does not occur చ is changed into వ.

పిలుచు + ము = పిలుము-పిలువుము

పిలుచు + డు = పిలుడు-పిలువుడు

నిలుచు + ము = నిలుము-నిలువుము

నిలుచు + డు = నిలుడు-నిలువుడు

The చ of లేచు is dropped before ము and డు.
లేచు + ము = లేము;
లేచు + డు = లేడు

Before ము and డు the preceding long vowels are shortend and the మ of ము is doubled.

లెమ్ము

డు becomes ండు after the first short vowel.

లె + డు = లెండు

The changes that some roots undergo before ము and డు are shown below.

తలచు—చ is changed into ప. తలపుము.
తలపుడు.

పోవు—వు is dropped — పోము—పోడు.

According to—పొమ్ము; పోడు = పొండు.

నేరుచు—చు is optionally dropped నేరుము or నేరువుము.
నేరుడు or నేరువుడు.

అగు—కా is optionally substituted for అగు.

| | |
|---|---|
| అగుము | అగుడు |
| కాము | కాడు |
| కమ్ము | కండు. |

వచ్చు—రా is substituted for వచ్చు. రాము రాడు
రమ్ము రండు

చూచు—చూడు is substituted for చూచు. చూడుము చూడుడు

చొచ్చు—చొరు is substituted for చొచ్చు. చొరుము చొరుడు

చచ్చు—చావు is substituted for చచ్చు. చావుము చావుడు

నొచ్చు—నోవు is substituted for నొచ్చు. నోవుము నోవుడు

తెచ్చు—తే or తేరు is substituted for తెచ్చు. తేము తేడు
= తెమ్ము తెండు
తేరుము తేరుడు.

ఇచ్చు—ఈ or ఈయు is substituted for ఇచ్చు. ఈము ఈడు
ఇమ్ము ఇండు
ఈయుము ఈయుడు

కొను (to take) కో is substituted for కొను. కోము కోడు
= కొమ్ము కొండు

## Roots

| | |
|---|---|
| అగు = to become | చొచ్చు = to enter |
| అనుసరించు = to follow | తలచు = to think |
| ఆడు = to play | నిలుచు = to stand |
| ఇచ్చు = to give | నేరుచు = to learn |
| కాచు = to protect | నొచ్చు = to feel pain |
| కొను = to take; to buy. | లేచు = to get up |
| చచ్చు = to die | సంరక్షించు = to protect. |

## Nouns

అన్నము (N) = Food
ఆట (N) = Play
ఈశ్వరుడు (M) = God
కరుణ (N) = Kindness
జ్ఞానము (N) = Knowledge
దీనుడు (M) = Man in distress
ధర్మము (N) = Righteousness
నిద్ర (N) = sleep
పద్మము (N) = lotus
పాఠము (N) = Lesson
పూజ (N) = Worship
భోజనము (N) = Dinner
వేళ (N) = Time
సుఖము (N) = Happiness
స్నేహితుడు (N) = Friend
హృదయము (N) = Heart
ఎల్లప్పుడు(adverb) = Always.

కృష్ణా! నిద్రనుండి లెమ్ము.
బాలకులారా! కథ చెప్పెదను వినుడు.
రావే! ఈశ్వర! కావవే కరుణ సంరక్షించు.
ఈశ్వరా! నాకు జ్ఞానము ఇమ్ము.
స్నేహితులను పిలువుము. వారితో ఆటలు ఆడుము.
నేను ఊరికి వెళ్ళుచున్నాను. నాతో నీవు కూడ రమ్ము.
బడికి వెళ్ళుము. పాఠములు నేరువుము.
హృదయమున శ్రీరాముని తలపుము. అతడు నిన్ను రక్షించును.
చెట్టు ఎక్కుము. ఫలములు కోయుము.
మీరు అచ్చట నిలువుడు. కొలను చూడుడు.

Kaika said to Dasaradha "give me two boons"
Enter the lake ; bring the lotuses.
Offer (do) worship to God· He will protect you.
Call your friend for dinner.
See the boys ; they are playing games.
Sister ! come here. sing a song*.
Sumitra said to Laxmana "My son ! go to the forest with Rama and live there with happiness".
Take food ; it is time for school.
Follow Dharma always*.
Protect the people in distress.



* The ము of the Imperative Mood is optionally dropped at the end of a sentence or when it is followed by a consonant.
చూడుము నన్ను or చూడు నన్ను.

* =Before ము and డు the చ of ఇంచు is optionally changed to ప. అనుసరించు + ము = అనుసరించుము or అనుసరింపుము.

# 9th Day

## VERBAL DERIVATIVES

I The present participle (శత్రంతము) is formed by adding చున్ to the root.

చూచు + చున్ = చూచుచున్ = seeing.

II The Infinitive of purpose (తుమర్థము) is formed by adding అన్ to the root.

చేయు + అన్ = చేయన్ to do.

The following are irregular forms of some roots in the Inifinitive of purpose.

వచ్చు - రాన్ = to come.

చూచు - చూడన్ = to see.

తెచ్చు - తేన్ or తేరన్ = to bring.

చొచ్చు - చొరన్ = to enter.

ఇచ్చు - ఈన్ or ఈయన్ = to give.

అగు - కాన్ = to become.

పోవు - పోవన్ or పోన్ = to go.

III The gerund (భావార్థకము) is formed by adding ట and the Negative gerund (వ్యతిరేకభావార్థకము) by adding అమి to the root.

చేయుట = doing

చేయు + అమి = చేయమి Not doing.

Irregular Negative Forms

వచ్చు — వచ్చుట — రామి.

అగు — అగుట — కామి.

తెచ్చు — తెచ్చుట — తేమి.

ఇచ్చు — ఇచ్చుట — ఈమి, ఈయమి.

చొచ్చు — చొచ్చుట — చొరమి.

చూచు — చూచుట — చూడమి.

కలుగు — కలుగుట — లేమి.

Generally the meaning of the Infinitive is expressed by using the భావార్థక in the genitive case.

చేయన్ — చేయుటకు.

IV చేదర్థకము (the form that conveys the sense of 'if' In Sanskrit చేత్ means if) is formed by adding ఇనన్ to the root.

కొట్టు + ఇనన్ = కొట్టినన్.

చేయు + ఇనన్ = చేసినన్*

Sometimes చో or ఎడల are added to ఇన to convey the same sense.

చూచు - చూచినన్ - చూచినచో - చూచినఎడల.

చేయు - చేసినన్ - చేసినచో - చేసినఎడల.

---

* Roots ending in యు change the యు into స when terminations beginning with a vowel are added to them. చేసినన్; పోసినన్ etc.

Roots

అరుగు = to go
ఆరంభించు = to begin
కోరు = to wish
దర్శించు = to see
మాను = to give up

Nouns

అపకారము = N. Harm
ఉపకారము = N. Help
కుచేలుడు = M. Friend of Krishna
కృష్ణుడు = M. The incarnation of Vishnu
తియ్యని = (Adj) Sweet
దయ = N. Kindness
ద్వారక = N. The abode of Krishna
నాటకము = N. Drama
పుస్తకము = N. Book
పేద = (Adj) Poor
భూమి = N. Earth
మేలు = N. Good
శబరి = A devotee of Rama

వానలు కురిసిన* పంటలు పండును.

* న్ at the end of చున్, అన్ and ఇనన్ is optionally dropped before the words beginning with consonants. When న్ is dropped గ, జ, డ, ద, బ are optionally substituted for క, చ, ట, త, ప respectively.

కురిసినన్ = కురిసిన.

చేయన్ + కోరెను = చేయకోరెను or చేయగోరెను. wished to do.

నాన్న కూరలు తెచ్చుటకు సంతకు వెళ్ళెను.
తమ్ముడు నాటకము చూడ నరిగెను.
మా ఇంటికి వచ్చుచు పోవుచు నుందుము.
జ్వరముచే చెల్లెలు బడికి వెళ్ళుట మానినది.
ఉపకారము చేయుట మానినను అపకారము చేయకుము.
సీత భర్తతో అడవికి వెళ్ళగోరెను.
పేదలను దయతో చూచిన దేవుడు మేలుచేయును.
కుచేలుడు కృష్ణుని దర్శింప* ద్వారకకు వెళ్ళెను.
నీవు తిట్టినయెడల ఆ బాలుడు ఏడ్చును.
రామునికి ఇచ్చుటకు శబరి తియ్యని ఫలములు తెచ్చెను.

The boy began to read.
I shall come if you write a letter.
Climbing the tree, the monkey fell down.
Vishnu came to protect the elephant.
The woman sold the fruits singing.
I go to school walking.
He will sell the books if you buy?
If you give a fruit the child stops weeping.
The washerman began to wash the clothes.
You will fall if you jump.



* చ of ఇంచు is changed into ప before అన్ and అమి also.
దర్శించు + అన్ = దర్శింపన్ to see.
దర్శించు + అమి = దర్శింపమి Not seeing.

# 10th Day

## VERBAL DERIVATIVES (Continued)

I క్త్వార్థకము (Incomplete verb) is formad by adding ఇ to the root.

II వ్యతిరేక క్త్వార్థకము (Incomplete verb–Negative) is formed by adding అక to the root.

Irregular forms:

అగు-అయి–కాక

పోవు-పోయి-పోక

వచ్చు-వచ్చి-రాక

తెచ్చు-తెచ్చి-తేక

ఇచ్చు-ఇచ్చి-ఈక; ఈయక

చూచు-చూచి-చూడక

కలుగు-కలిగి-కలుగక or లేక

చొచ్చు–చొచ్చి–చొరక

చచ్చు-చచ్చి–చావక

III The present participle (వర్తమాన కాల క్రియాజన్య విశేషణము) is formed by adding చున్న to the root.

వచ్చు + చున్న = వచ్చుచున్న Coming.

IV The past participle (భూతకాల క్రియాజన్య విశేషణము) is formed by adding ఇన to the root.

చూచు + ఇన = చూచిన.

V The future participle (భవిష్యత్కాల క్రియాజన్య విశేషణము) is formed by adding అగల to the root.

వచ్చు + అగల = రాగల That will come.

చేయు + అగల = చేయగల That will do.

VI The Taddharma Participle is formed by keeping the root as it is or by adding ఎడు or ఎడి to the root.

చేయు; చేయు + ఎడు = చేసెడు: చేయు + ఎడి = చేసెడి

కల is substituted for కలుగు, కలిగెడి or కలిగెడు (Taddharma forms of the root కలుగు).

To the two forms ending in ఉ (చేయు, చేసెడు) న్ is added before words beginning with a vowel.

చేయు + అతడు = చేయున్ అతడు = చేయునతడు

చేసెడు + అతడు = చేసెడున్ అతడు = చేసెడునతడు

చేసెడి + అతడు = చేసెడి అతడు

VII The Negative Participle is formed by adding అని to the root.

చేయు + అని = చేయని

చూచు + అని = చూడని

Some irregular forms

| | |
|---|---|
| అగు–కాని | చూచు-చూడని |
| వచ్చు–రాని | పోవు-పోని; పోవని |
| తెచ్చు–తేని | చొచ్చు-చొరని |
| కలుగు-కలుగని:లేని | చచ్చు-చావని |

## Roots

ఓదార్చు — To console
డోకు — To vomit
ప్రేమించు — To love
మొరుగు — To bark
వెలియు — To stop

## Nouns

గురువు M. = Teacher
తెలివి N. = Intelligence
దొంగ M.F. = Thief
పశువు M. = Beast
బాలిక F. = Girl
మామిడి N. = Mango
విద్య N. = Learning
సొమ్ము N. = Money
వింత Adj. = Peculiar

నేను నిన్న నాటకము చూచి వచ్చితిని.

నేడు బడికి పోయిరమ్ము.

వాన కురిసి వెలిసినది.

ఉదయించుచున్న సూర్యుని చూడుము.

నీవుతెచ్చిన పుస్తకము ఎక్కడ కొంటివి?

విద్య లేనివాడు వింత పశువు.

మీరు దొంగను కొట్టక విడిచితిరి.

వారు కొనగల ఇంటికి వెళ్ళివచ్చిరి.

చదివిన వారికి జ్ఞానము కలుగును.

బడికి పోవు (పోయెడి, పోయెడు) బాలురను పిలువుము.

The boy went to school without reading* the lesson.
The teachers love the boys having intelligence.
Read the letter that came yesterday.
The child is vomitting the milk that he drank.
Eat the mango fruits and go.
My father went without giving money for buying the books.
The washerman is beating the dog that is barking.
Stand up those that have not read the lessons.
He is consoling the girl that is weeping.
Count the boys that will come to school tomorrow.



* The తుమర్థక of the root ఉండు (in) ఉండ(న్) is aptionally added to the వ్యతిరేకక్త్వార్థక. చదువు-చదువక; చదవకుండ; ఇచ్చు-ఈయక; ఈయకుండ.

# 11th Day

## వ్యతిరేకక్రియలు

## NEGATIVE VERBS

I The Negative Verb in the Present Tense is formed by adding లేదు to the భావార్థకము (Gerund).

చేయుచున్నాడు — చేయుటలేదు (Neg.)

The same form is used in all the Persons bothi n the Singular and Plural Numbers.

| | |
|---|---|
| వాడుచేయుట లేదు. | వారు చేయుట లేదు. |
| నీవు చేయుట లేదు. | మీరు చేయుట లేదు. |
| నేను చేయుట లేదు. | మేము చేయుట లేదు. |

II The Negative Verb in the Past Tense is formed by adding లేదు to the Infinitive of Purpose of the root.

చేసెను _ చేయలేదు He did not do.

చదివెను - చదువలేదు He did not read.

The same form is used in all the Persons both in the Singular and Plural Numbers.

III The Negative Verb in the Future Tense and the Taddharma is formed by adding అ and then the following terminations to the root,

| | ఏక | బహు |
|---|---|---|
| III | డు — చేయడు | రు - చేయరు |
| II | వు — చేయవు | రు - చేయరు |
| I | ను — చేయను | ము - చేయము |

IV The Negative form in the Imperative Mood is formed by adding అకు before ము and డు.

చేయకుము (Sing.) చేయకుడు (Plural)

అ, ఆ; ఇ, ఈ; అయ్య (Masculive) and అమ్మ (Feminine) are added to ము and డు to indicate equest, Prayer or entreaty.

చేయకుమా చేయకుమీ

చేయకుడీ చేయకుమయ్య

చేయకుడయ్య చేయకుమమ్మ

Some irregular forms.

తెచ్చు-తేలేదు*-తేకుము-తేకుడు-తేడు

వచ్చు-రాలేదు-రాకుము-రాకుడు-రాడు

అగు-కాలేదు-కాకుము-కాకుడు-కాడు

చూచు-చూడలేదు-చూడకుము-చూడకుడు-చూడడు

చచ్చు-చావలేదు-చావకుము-చావకుడు-చావడు

---

* give-didnot bring-do not bring- He, she or it will not bring

తేవు - తేరు (II Person. Neg. forms)

తేను - తేము (I Person. Neg. forms).

**Nouns**

ఏడు = Year

గారు = Honorific affix

గొడుగు = Umbrella

శివరాత్రి = Hindu festival in honour of Siva

ఒంటరి*[1] = Lonely person

బిగ్గర = Loud

**Adverbs**

కూడ = Also

కాబోలును = Perhaps

ఇతరుడు = (Pronoun) other Person

**Root**

మూయు = To shut

ఈ ఏడు వానలు కురియుటలేదు; పంటలు పండవు కాబోలును.
చెట్టునుండి దుముకకుము; కాలు విరుగ గలదు.
నిన్న నేను బడికి వెళ్ళలేదు; నేడు కూడ వెళ్ళను.
అబద్ధము చెప్పకుము; అల్లరి చేయకుము.
"నాతో అడవికి రాకుము" అని రాముడు సీతతో చెప్పెను.
కాని సీత వినలేదు (వినదయ్యెను).*[2]
నీ నుండి జాబులు వచ్చుట లేదు; కారణము తెలియదు.
చాకలి బట్టలు తేలేదు; ఉతుకలేదు కాబోలును

---

1. * కాన్ is the Infinitive of purpose of the root అగు. The Initial క of this is generally changed into గ. The long ఆ of కాన్ is optionally shortened. కాన్, కన్ - గాన్, గన్. When used after Nouns and Adjectives it gives the adverbial meaning. బిగ్గరగా = Loudly; ఒంటరిగా = Alone.

2. * The Past Tense forms of అగు (అయ్యెను etc.) are added to the Negative Taddharma forms and give the meaning of the Past Tense.
చెప్పడు — చెప్పడయ్యెను.
వినదు — వినదయ్యెను.

బావ పెండ్లికి రాలేదు; వెళ్ళి పిలువనైతిని.
చెడ్డవారితో స్నేహము చేయకుము.
చెడ్డవ్రాతలు వ్రాయకుము; చెడ్డమాటలు (ఆడకుము) పలుకకుము.

Do not abuse others.
I did not read the books that you gave me.
I am not telling a lie; do not beat me.
He will not sing if I ask.
Today is Sivaratri; My father and mother do not take food.
Younger brother is not bringing the umberella; Perhaps he did not buy it.
Do not go alone in a forest.
There are no mango fruits in the fair;
I have not brought them.
There is no rain; close the umbrella.
The teacher did not read loudly;
I did not hear properly.

———

| | M. | F. | M.F. Plural. |
|---|---|---|---|
| Nom. | ఎవడు - | ఎవతె | ఎవరు |
| Obj. | ఎవనిని - | ఎవతెను | ఎవరిని |
| Inst. | ఎవనిచే - | ఎవతెచే | ఎవరిచే |
| Dat. | ఎవనికొరకు - | ఎవతెకొరకు | ఎవరికొరకు |
| Abl. | ఎవనివలన - | ఎవతెవలన | ఎవరివలన |
| Gen. | ఎవనియొక్క- | ఎవతెయొక్క | ఎవరియొక్క |
| Loc. | ఎవనియందు - | ఎవతెయందు | ఎవరియందు |
| Nom. | ఏది N. | | ఏవి |
| Obj. | దేనిని | | వేనిని |
| Inst. | దేనిచే | | వేనిచే |
| Dat. | దేనికొరకు | | వేనికొరకు |
| Abl. | వేనివలన | | వేనివలన |
| Gen. | దేనియొక్క | | వేనియొక్క |
| Loc. | దేనియందు | | వేనియందు |

## Adverbs

ఎంత – How much

ఎందుకు<br>ఎందుకై } For what; For what purpose.

ఎందుచేత – Why; ఎందువలన – Why

ఏ – What; Which; ఏమి – What; ఏమిటి – What.

ఏటికి – Why.

## Roots

అడుగు - to ask
అపహరించు - to steal
తీయు - to take
దాటు - to cross; to violate
వెదకు - to search

## Nouns

అర్థము N. = Meaning
ఉత్తరము N. = Letter
కాఫీ N. = Coffee
చిరునామా N. = Address
తలుపు N. = Door
నాయకుడు M. = Leader
పద్యము N. = Verse
వాల్మీకి N. = The author of the Ramayana
వెల N. = Price, Cost.

వేడి (Adj.) Hot. (N.) Heat.

ఆ బాలుడు ఏడ్చుచున్నాడేల? అన్నము తినలేదా?

నీవు చదువుచున్న పుస్తకము ఏమిటి? అర్థము తెలియుచున్నదా?

దశరథుని కుమారులు ఎవరు? వారిపేరులు ఏమి?

నిన్న ఎన్నిపుస్తకములు కొంటివి? వాని వెల ఎంత?

నాన్న నేడు వచ్చునా? రాడా?

నేడు బడి ఉన్నదా? నీవు ఎందుకు వెళ్ళలేదు?

నీవు అన్నయ్యకు ఉత్తరము వ్రాసితివా? వాని చిరునామా ఏమిటి?

సీతను వెదకుటకు ఎవరు వెళ్ళిరి? వారి నాయకుడు ఎవరు?

ఈ వ్రాత ఎవడు (ఎవరు) తెచ్చినాడు? (తెచ్చినారు) అది నిజమా? అబద్ధమా?

మీ చాకలి ఎవడు? బట్టలు సరిగా ఉతుకునా?

What is the meaning of this verse ?
From which book did you take it ?
Did you read Ramayana? Who wrote it ?
For whom are you seeing ? Does he come now ?
From whom did you hear this news ? Can yo believe it ?
Why is the dog barking ? Who opened the door ?
"Who can cross the ocean ?" The leader asked the monkeys ?
Who stole Sita ? What do you know about him ?
To whose house are you going ? Why ?
Why don't you buy the books to day ?
Why don't you drink that coffee ? Is it hot ?

-X-

# 13th Day

## INTERROGATIVE SENTENCES (Contd.)

Some more interrogative Adverbs ase given below. Some of them take some (Vibhakti) case terminations like Nouns.

ఎంతమంది * = How many.

ఎక్కడ, ఎచ్చట = Where.

ఎక్కడికి, ఎచ్చటికి = To where.

ఎక్కడనుండి, ఎచ్చటనుండి = From where.

ఎట్లు = How.

ఎప్పుడు = When? ఎప్పటినుండి = From when.

ఎప్పటికి = By when:

### Roots

జీవించు = to live

ప్రేమించు = to love.

పోరు = to fight.

ముగియు = to end.

### Nouns

కీచకుడు M. = Brother of Sudeshna wife of king Virata.

తరగతి N. = Class:

నామము N. = Name.

పడవ N. = Boat.

వయస్సు N. = Age.

---

* When persons are to be indicated మంది is added to ఎంత, అంత, ఇంత.

లంకిణి F. = A Rakshasa woman, Presiding over Lanka.

ఎక్కువ (Adj) = Much; great.

తియ్య (Adj.) = Sweet.

మీరు ఎక్కడనుండి ఎక్కడికి పోవుచున్నారు?

నీవు బడినుండి ఇంటికి ఎప్పుడు వచ్చెదవు?

లంకిణి ఎవతె? ఆమె హనుమంతుని చూచి ఏమిచేసెను?

హనుమంతుడు సీతకొరకు ఎక్కడ వెదకెను?

నీవు చేయుచున్న పని ఎప్పటికి ముగియును?

నాన్న ఊరికి దేనిమీద వెళ్ళును? బండిమీదనా? పడవమీదనా?

హనుమంతుడు రాముని ఎప్పుడు ఎట్లు దర్శించెను?

అడవిలో మునులు వేనిని తిని జీవింతురు?

నీవు అన్నము తినక ఎట్లుండగలవు?

దశరథుని భార్యలు ఎవరు? వారి పేరులు నీకు తెలియునా?

How many boys and girls are there in your class?
Sita asked Hanuman, "How did you come to Lanka? When did you see Rama? How is he? Does he think about me?"
Whom did Kichaka love? Did she also love him?
How did Kichaka die? With whom did he fight?
With what did you cut the mango fruit? Is it sweet?
What is your name? What is your village?
How many younger sisters have you*? What (How much) is your age?
Since how many years have you been reading Sanskrit?
What is the time now?
Whom did Dasaratha love among his wives?

---

* This must be translated as నీకు ఎంతమంది చెల్లెండ్రు (కలరు?).

# *14th Day*

## AUXILIARY VERBS
## సహాయక్రియలు

I కూడును, వలయును, చెల్లును, తగును, వచ్చును and their negative forms కూడదు, వలదు, చెల్లదు, తగదు, రాదు are added to the Infinitive forms of the roots to denote several meanings.

| | |
|---|---|
| చేయగూడును | చేయగూడదు |
| To do is proper | To do is not proper |
| చేయవలయును | చేయవలదు |
| To do is necessary | To do is not necessar |
| చేయతగును | చేయతగదు |
| To do is proper | To do is not proper |
| చేయవచ్చును | చేయరాదు |
| To do is proper<br>May do | To do is not proper<br>Should not do |

II The above forms are used in all persons and in both the numbers without any change.

నీవు చేయవచ్చును; నేను చేయవచ్చును.

వాడు చేయవచ్చును; నీవు చేయరాదు.

వాడు చేయరాదు; నేను చేయరాదు.

III When వలయును is added roots denote request or command and when వలదు is added they denote request or prohibition.

| | |
|---|---|
| నీవు రావలయును | You should come. |
| నీవు రావలదు | You should not come. |

IV In these forms the Infinitive gives the meaning of the gerund or భావార్థక which is formed by adding ట to the root and it becomes the subject of the verb.

చేయతగదు; చేయన్=చేయుట—తగదు

To do is not proper.

చూడవలయును—చూడన్ = చూచుట—వలయును

To see is necessary.

V కల is added to the Infinitive forms to indicate capability. లే is substituted for కల in the Negative. Their forms in the three persons and the two numbers are given below.

| | ఏక | బహు | ఏక | బహు |
|---|---|---|---|---|
| III | కలడు | కలరు | లేడు | లేరు |
| II | కలవు | కలరు | లేవు | లేరు |
| I | కలను | కలము | లేను | లేము |

Roots

కొలుచు = to measure; to serve. పూజించు = to worship.

పట్టు = కలుగు = to occur యత్నించు = to try.

Nouns

తప్పు N. = Wrong; Fault. వేగముN. = Speed; Quickness.

పరీక్షN. = Examination. సాయముN. = Help.

పురుషుడుM. = Male; Man. సెలవుN. = Holiday.

మబ్బుN. = Cloud. శిష్యుడుM. = Disciple.

కావున Conj. = Therefore. కుంటి Adj. = Lame.

దట్టము Adj. = Thick. వలె Adv. = Like.

లేనిచో Adv. = Otherwise.

"నీవు సముద్రము దాటవలయును" అని జాంబవంతుడు హనుమంతుని కోరెను.

ఎప్పుడును అసత్యము చెప్పగూడదు.

పేదలకు ఉపకారము చేయవలయును.

"జ్వరము వచ్చినది కావున నీవు నేడు బడికి పోవలదు" అని మా అమ్మ చెప్పినది.

శిష్యులు గురువులను పూజించవలయును.

దట్టముగా మబ్బుపట్టినది; నేడు వాన కురియవచ్చును.

చెడ్డవారితో స్నేహము చేయరాదు.

నీవు ఇప్పుడు పోయినచో రాత్రికి తిరిగి రాగలవా?

స్వామీ! నన్ను ఈ ఆపదనుండి రక్షింపవలయును.

కుంటివాడు నడవగలడా? నడవలేడు.

My brother went to Banaras. He may come tomorrow.
You should not forget the help done by others.
I have to read well tonight; otherwise I can not write in the Examination tomorrow.
It is not proper for you to abuse your friend.
You can do this sum if you try.
The boy asked his grand father, "You have to tell me a good story to-day."
It is proper for boys and girls to read good books in the holidays.
You should not serve a person who always searches for faults.
He is a lame boy; Therefore he can not walk quickly.
You should love others as your brothers



# 15th Day

Verbs denoting ఆశీస్సు (blessing) శాపము (curse) and giving the meaning of used to - Past continuous - Past Perfect-would have and should have.

I ఎడున్ or తన్ is added to the root to express blessing or cursing.

చేయు – ఎడున్ – చేసెడున్.

చేయు – తన్ – చేయుతన్.

II కాక or కావుతన్ is added to the Taddharma verb to express blessing or cursing.

చేయు* గాక — చేయుగావుతన్.

చేయుదువుగాక — చేయుదురుగాక.

చేయుదునుగాక — చేయుదుముగాక.

III The Taddharma verb by itself denotes blessing or cursing.

IV ఉండెడి, ఉండెడు or ఉండు followed by వాడు, వారు, అది or అవి according to the person, gender, or number is added to the Present Participle ending in చు to give the meaning fo'used to'

వాడు మా ఇంటికి వచ్చుచుండెడివాడు; వచ్చుచుండెడువాడు; వచ్చుచుండు వాడు. He used to come to my house.

---

* The క of కాక and కావుతన్ is changed to గ after the Taddharma Verbs.

ఆమె or అది వచ్చుచుండెడిది.*

వారు వచ్చు చుండెడివారు.

V Past Continuous is formed by adding the Past form of the root to the Present Participle of the root ending in చు.

He was comming వాడు వచ్చుచుండెను.

Thy were coming వారు వచ్చుచుండిరి.

I was coming నేను వచ్చుచుంటిని.

VI Present and Past Perfect is formed by adding the Present and Past forms of the root ఉండు according to the Person, gender or number to the క్త్వార్థక form of the root ending in ఇ.

రాముడు వెళ్ళి ఉన్నాడు Rama has gone.

రాముడు వెళ్ళి ఉండెను Rama had gone.

VII Future Perfect is formed by adding the Taddharma forms of the root ఉండు according to the Person, gender or Number to the క్త్వార్థక from of the root ending in ఇ.

రాముడు వెళ్ళి ఉండును Rama will have gone.

నేను వెళ్ళి ఉందును I shall have gone.

VIII The meaning of 'would have' is expressed by adding ఉండెడి, ఉండెడు or ఉండు followed by వాడు, వారు, అది or అవి according to Person, gender and Number to the క్త్వార్థక form the root.

వాడు వచ్చిఉండెడివాడు = He would have Come.

---

* The అ of అది or అవి is dropped after ఉండెడి. ఉండెడిని. ఉండెడివి

IX The meaning of 'should have' or 'must have' is experessed by adding ఉండవలెను or ఉండవలసినది to the క్త్వార్థక form of the root in all the Persons, genders and numbers.

I should have gone there = నేను అక్కడికి వెళ్ళి ఉండవలెను; వెళ్ళి ఉండవలసినది.

You must have gone there = నీవు అక్కడికి వెళ్ళి ఉండవలెను; వెళ్ళి ఉండవలసినది.

X The meaning of have to, had to or shall have to is expressed by adding వలసి ఉన్నది, వలసి ఉండెను or వలసి ఉండును respectively to the infinitive form of the root.

దానిని నేను చేయవలసి ఉన్నది I have to do it

దానిని నేను చేయవలసి ఉండెను I had to do it

దానిని నేను చేయవలసి ఉండును I shall have to do it

## Roots

క్షమించు = To excuse.

మూలుగు = To sigh.

మూగు = To flock.

ప్రోచు = To protect.

## Nouns

ఆసుపత్రి N. = Hospital

నరకము N. = Hell

గాంధీజీ M. = Mahatma Gandhi

పాపి M. = Sinner

తిక్కడు M. = Name of a person

భవనము N. = Palace

దంపతులు M.F. = Couple

రైలు N. = Train

దయ N. = Kindness

దినము N. = Day

దేవతలు M.F. = Gods

అట్లు (Adv.) = In that manner

క్రింద (Adv.) = Under; Back

చుట్టు (Adv.) = Around

వెనుక (Adv.) = Behind

క్రొత్త (Adj) New

ధన్యుడు M (Adj) Blessed man

సొంత (Adj) own

దేవుడు క్రొత్త దంపతులను ప్రోచుకాక (గాత)
హరి తిక్కని ధన్యు చేయుతన్.
దేవతలు జనులకు సుఖములు ఇత్తురు గాక.
తెలివిని, సంపదల్, సుఖము దేవుడు రాజునకు ఇచ్చి ప్రోచెడున్.
అడవిలో రాముడు సీత వెనుక నడచుచుండెడివాడు.
పది దినముల క్రింద నేను బావను చూడ నరిగితిని.
అప్పుడు అతడు జ్వరముతో మూలుగు చుండెను.
మా నాన్న అప్పుడు కాశికి వెళ్ళి ఉండెను.
నీవు పిలిచి ఉండినచో మామ పెండ్లికి వచ్చి ఉండెడివాడు.
ఇప్పుడు పది గంటలు అయినది; అమ్మ ఇప్పటికి ఆసుపత్రికి
వెళ్ళి ఉండవలెను.

నీవు బావను చూచిరమ్ము; అతడు ఇంటికి వచ్చి ఉండును.

ఈ పుస్తకము నేను చదువవలసి ఉన్నది; రేపు దీనిని గూర్చి చెప్పవలసి ఉండును.

May God protect the people.

May the sinners go to hell.

People used to flock round Gandhiji wherever he went.

Kaika used to love Ramas as her own son.

Rama went to his mother's palace;

She was then thinking about him.

I had seen you five years back.

Sister-in-law would have certainly come if she had known about the marriage.

You should have gone there by 10 O'clock.

The teacher would have seen you in the school.

My brother might have come in the train.

I have to go to-day otherwise my father will abuse me.

Kindly excuse me; I had to go away in that manner.

## NEGATIVE VERBAL FORMS

## వ్యతిరేక క్రియారూపములు

| Positive | Negative |
|---|---|
| May rain fall<br>వాన కురియుగాక | May rain not fall<br>వాన కురియకుండుగాక |
| May god protect the people | May god not protect the wicked people. |
| దేవుడు ప్రజలను రక్షించును. | దేవుడు దుష్టులను రక్షింపకుండుగాక. |

| | |
|---|---|
| He used to read the verses<br>అతడు పద్యములను చదువు<br>చుండెడివాడు | He never used to read the verses<br>అతడు ఎప్పుడును పద్యములు<br>చదువకుండెడివాడు లేక<br>చదువుచుండెడివాడు కాడు |
| He was then reading<br>అతడు అప్పుడు చదువు<br>చుండెను | He was then not reading<br>అతడు అప్పుడు చదువు<br>చుండుటలేదు. |
| Rema had gone<br>రాముడు వెళ్ళి ఉండెను | Rama had not gone<br>రాముడు వెళ్ళి ఉండలేదు |
| He would have come<br>వాడు వచ్చి ఉండెడివాడు | He would not have come<br>వాడు రాకుండెడివాడు<br>వాడు వచ్చి ఉ డెడివాడు కాడు |
| He may come tomorrow | వాడు రేపు రావచ్చును. |
| He may not come tomorrow | వాడు రేపు రాకుండవచ్చును. |
| He should have come | వాడు వచ్చి ఉండవలెను లేక<br>ఉండవలసినది. |
| He should not have come | వాడు రాకుండవలెను<br>రాకుండవలసినది<br>వాడు రాకపోవలెను<br>వాడు రావలసినదికాదు. |
| I have to do it | నేను దానిని చేయవలసి ఉన్నది. |
| I have not to do it | నేను దానిని చేయవలసి లేదు. |
| I had to do it | నేను దానిని చేయవలసి ఉండెను. |

| | |
|---|---|
| I had not to do it | నేను దానిని చేయవలసి లేకుండెను. |
| | నేను దానిని చేయవలసి ఉండలేదు. |
| I shall have to do it | నేను దానిని చేయవలసి ఉండును. |
| I shall not have to do it | నేను దానిని చేయవలసి ఉండదు. |

---

# 16th Day

## CLAUSES

I అని or అట్లు is used for the 'that' of the Noun Clause.

He told me **that** he read the Bhagavadgeeta.

అతడు తాను భగవద్గీత చదివితిని అని నాకు చెప్పెను

చదివినట్లు నాకు చెప్పెను.

He asked me **what** I read.

అతడు నేనేమి చదివితిని అని అడిగెను.

చదివితినో అడిగెను.

**That** he is a scholar is known to all.

అతడు పండితుడు అని అందరికిని తెలియును.

అతడు పండితుడు అగుట అందరికిని తెలియును.

II Who, which, that, where etc. that begin an adjectival clause in English are not found in Telugu. To translate them as ఎవరు, ఏది, ఎక్కడ etc. is not idiomatic in Telugu The Verbs in the Adjectival clauses are generally substituted by the Participles of the same roots

He died in the Village where he was born

అతడు ఎక్కడ (ఏ గ్రామమున) పుట్టెనో ఆ గ్రామమున మరణించెను. Though this is grammatically correct, this is not idiomatic in Telugu

అతడు తాను పుట్టిన గ్రామమున మరణించెను. is natural in Telugu.

The boy who stood on the wall fell down.
గోడమీద నిల్చిన బాలుడు క్రింద పడెను.

I can not forget the help which he has done me.
అతడు నాకు చేసి ఉన్న సాయము మరవలేను.

The time when he comes is not known.
అతడు వచ్చు సమయము తెలియదు.

He forgot the verse that he had read.
అతడు తాను చదివి ఉండిన పద్యమును మరచెను.

III Adverbial Clausss :

(a) When an adverbial clause begins with if or 'in case' its meanning can be expressed in Telugu by using the చేదర్థక of the root or by adding చో or ఎడల to the past Partici-ple of the root.

If rain falls I do not go to school
వానకురిసిన (కురిసినచో, కురిసిన ఎడల) నేను బడికి వెళ్ళను.

(b) When an Adverbial clause begins with 'when' the meaning can be expressed by using the Participle of the root followed by 'అప్పుడు'.

Please call me when you go to school
నీవు బడికి వెళ్ళునప్పుడు నన్ను పిలువుము.

He called me when he went to school
బడికి వెళ్ళినపుడు అతడు నన్ను పిలిచెను.

(c) When the Adverbial clause begins with as, because or any word giving the same meaning, the meaning can be expre-ssed by the భావార్థక of the root followed by చే or చేత (Terminination of the Instrumental case).

The boy was weeping because (as) the dog bit him.
కుక్క కరచుటచే బాలుడు ఏడ్చుచుండెను.

(d) The sense of though is expressed in Telugu by adding ఐనను or ఐనప్పటికిని to the root.

The boy did not come though his friend called him.
మిత్రుడు పిల్చినను (పిల్చినప్పటికిని) బాలుడు రాలేదు.

(e) The sense of till or until is expressed by adding వరకు or అంతవరకు to the participle.

Search for the book until it is seen.
పుస్తకము కనబడు (నంత) వరకు దాని కొరకు వెదకుము.

(f) The sense of after is expressed by adding తరువాత or పిమ్మట to the past participle of the root.

I shall tell him after he comes.
అతడు వచ్చిన తరువాత (పిమ్మట) అతనికి చెప్పెదను.

The sense of before is expressed by adding ముందు to the భావార్థక (Gerund) of the root in the Genitive case.

Drink milk before you sleep.
నీవు నిద్రించుటకు ముందు పాలు త్రాగుము.

(g) The sense of as (adverbial clause of manner) is expressed by adding అట్లు or విధమున to the participle of the root.

Do as he says అతడు చెప్పునట్లు (చెప్పు విధమున) చేయుము.

I did as he asked.
అతడు అడిగినట్లు (అడిగిన విధమున) నేను చేసితిని.

(h) The sense of unless is expressed by using the చేదర్థక of the root, followed by కాని.

I do not eat unless he comes.
అతడు వచ్చినకాని నేను తినను.

(i) The sense of that or so that (Adverbial clause of result) is expressed by using the భావార్థక of the root in the Dative case.

The thief wept loudly so that the king's heart might melt.
రాజు హృదయము కరగుటకై దొంగ బిగ్గరగా ఏడ్చెను.

It is expressed by adding అని to the Taddharma verb.

రాజు హృదయము కరగును అని దొంగ బిగ్గరగా ఏడ్చెను.

Sometimes the meaning of the whole sentence is expressed by two separate sentences.

దొంగ బిగ్గరగా ఏడ్చెను. రాజు హృదయము కరగెను.

Roots

| | |
|---|---|
| కట్టు = To pay; to bind. | తగ్గు = to come down; to decrease. |
| కుట్టు = To sew; to bite. | తేలు = to float. |
| చెల్లించు = To pay | బోధించు = to teach. |
| | మోసగించు = to deceive. |
| | వండు = to cook. |

Nouns

కళాశాల N. = College. లేడి N. = Deer.

జీతము N. = Salary; Fees. సినీమా N. = Cinema.

తేలు N. = Scorpion.

దైన్యము N. = Humility; Wretchedness.

రాక్షసుడు M. = Demon.

పదునాలుగు (Numerical) = Fourteen.

పలువురు (Pro Noun) = Many.

బంగారు (Adj.) = Golden.

తానుకూడ అడవికి వత్తును అని సీత రామునితో చెప్పెను.

ఎక్కడనుండి వచ్చుచున్నావు అని మిత్రుని అడిగితిని.

మేము కొనిన (కొన్న) ఇల్లు దగ్గరగా ఉన్నది.

నన్ను కొట్టిన దుష్టుడు మరణించుగాక.

రాముడు నివసించిన అడవిలో పలువురు రాక్షసులు ఉండిరి.

మా మిత్రుడు వచ్చినఎడల నేనుకూడ సినీమాకు అరిగెదను.

రాముడు బంగారులేడి కొరకు వెళ్ళినప్పుడు రావణుడు సీతను అపహరించెను.

తేలు కుట్టుటచే ఈనాడు మా అమ్మ అన్నము వండుటలేదు.

వర్షము కురియుచున్నను (కురియుచున్నప్పటికిని) నేను నేడు బడికి పోవలయును.

అర్థము తెలియునంతవరకును ఈ పద్యముచదువుచుండుము.

Tell me the story after you read the book.

Do the sum as your teacher taught in the school.

Do not take food until fever comes down.

He fought so bravely that the enemies could not stand.

Kaika told Rama that he should live in the forest for fourteen years.

The school where I studied has now become a college.

The friend whom I belived deceived me.

If my father had not written the letter, I would have gone to the village by now.

Plesae tell me the news before I go to the college.

He cou'd not pay the fees as he was poor.

You can not know the meaning of the verse unless you read it twice.

—X—

# 17th Day

## ATMANEPADA, SABDAPALLAVA AND COMPOUND VERBS

1. Atmane is the Dative Singular of the word Atman and its meaning is 'for onself'.

i When the fruit of the action is enjoyed by the Agent (కర్త) himself the verb is said to be Atmanepada. In Telugu Atmanepada roots are formed by adding కొను to them.

వండు - వండుకొను

అతడు అన్నము వండెను = He Cooked food (for others)

అతడు అన్నము వండుకొనెను (ఆత్మనేపద)

He cooked food (for himself)

ii Before కొను the ending ఉ of roots is optionally changed to ఇ.

వండుకొను - వండికొను

iii Roots ending in యు substitute ను for యు before కొను and here the change of ఉ into ఇ is compulsory.

This change is not strictly observed by many modern writers.

చేసికొను - చేసుకొను

vi Sometimes కొను is added to roots in their own sense (స్వార్థ)

పండు — పండుకొను; అందు — అందుకొను

తేరు — తేరుకొను; చేరు — చేరుకొను; ముట్టు — ముట్టుకొను.

2. Roots like కొను, ఉండు, పోయు, పోవు, వేయు etc. are added to other Roots, Nouns, Verbal Derivatives and give a modified meaning. Such forms are called శబ్ద పల్లవములు. Some శబ్ద పల్లవములు and their meanings are given below.

కూరిచి + ఉండు = కూరుచుండు; కూర్చుండు to sit

నిలిచి + ఉండు = నిలుచుండు, నిల్చుండు } to stand

పడి + ఉండు = పరుండు to lie down

ఆఁకలి + కొను = ఆకొను to be hungry

ఈయు + కొను = ఈకొను to agree

మే (మై) + కొను = మేకొను, మైకొను to agree

మేలు + కొను (కను, కాంచు) = మేలుకొను, మేల్కొను; మేలుకను, మేల్కను; మేలుకాంచు, మేల్కాంచు

to wake up; to get up from sleep.

అలవు + పడు = అలవడు to be accustomed.

ఏరు + పడు = ఏరుపడు, ఏర్పడు to become clear, to farm.

తలపు + పోయు = తలపోయు to think.

వెలి + పడు = వెలువడు to come out.

కై + వ్రాలు = కైవ్రాలు to fall aside.

కై + చేయు = కైసేయు to adorn.

అయి + పోవు = అయిపోవు to be over, to be finished.

3. S metimes పోవు, వేయు etc are added to roots in the sense of away or off.

వెళ్ళిపోయెను Went away.

తీసివేసెను Took off.

ROOTS

కట్టు – to bind

కొట్టు – to beat

తొడుగు – to wear to put on; to place on.

Nouns

అమృతము N. = Neetar.

కూడు N. = Food.

చెంప N. = Cheek, Side.

చొక్కా N. = Shirt.

తీగ N. = Creeper – Wire.

ప్రతిదినము = Every day.

పిచ్చివాడు N. = Mad man.

బయలు N. = Outside place.

విగ్రహము N. = Idol.

వీపు N. = Back.

కొంచెము Adj. = Little.

మా అమ్మ ఊరికి వెళ్ళుటచే నేడు నేను వండుకొంటిని.

అప్పులబాధ పడలేక మా మిత్రుడు ఇల్లు అమ్ముకొనెను.

నీవు చొక్కా తొడుగుకొనగలవా? నేను తొడగవలెనా?

ఆమె దేవుని విగ్రహము ముందు చెంపలు కొట్టుకొనుచున్నది.

పిచ్చివాడు తన్ను తిట్టుకొనుచు ఇతరులను కొట్టుచున్నాడు.

పాఠములు రేపు చదువుకొనవచ్చును; ఇప్పుడు పండుకొనుము.

అన్నయ్య పదిగంటలకు మదరాసు చేరుకొనియుండును.

నేను ఉదయము అయిదు గంటలకు మేలుకొనుచుందును.

రావణుడు సీతను లంకకు కొనిపోయెను.

నేడు పరీక్షల ఫలితములు పత్రికలలో వెలువడును.

Why do you stand there? Come here and sit.

As the washerman did not come I have to wash my clothes myself.

When the teacher does not come I shall read myself.

The elephant is throwing dust on its back.

Protect yourself until I come.

Hungry people think that the little food they get is nectar.

My friend agreed to give me his books after the examinations are over.

Women adorn themselves when thy go out.

The boy folded his hands and stood before the idol of God.

Do not touch the wire; it is very hot.



# 18th Day

## CAUSAL VERBS

## ప్రేరణార్థక క్రియలు

1. The Causal verb implies that a person or thing makes another person or thing to perform the action denoted by the root.

చేయు — చేసెను He did

చేయించెను (Causal) He made another to do

2. The Causal base is generally formed by adding ఇంచు to the root.

వండు — వండించు      వచించు — వచింపించు

ఆవులించు — ఆవులింపించు      స్తుతించు — స్తుతింపించు

3. Tatsama roots are formed by adding the termination ఇంచు to Sanskrit roots. This ఇంచు is different from the causal termination ఇంచు.

వచ్ to speak వచించు; పుష్ to nourish పోషించు.

The following Sanskrit roots take the termination ఇల్లు instead of ఇంచు

రంజ్ to be pleased రంజిల్లు

భాస్ to shine భాసిల్లు

రాజ్ to shine రాజిల్లు

భిద్ to break భేదిల్లు

కంప్ to shake కంపిల్లు

వృధ్ to prospar, to increase వర్ధిల్లు. When ఇంచు is added to the above roots they denot the causal sense.

రంజిల్లు — రంజించు — to please

వర్ధిల్లు — వర్ధించు to make one prosper.

భేదిల్లు — భేదించు — to break (Transitive)

కంపిల్లు — కంపించు — to make one shake

కంపించు is used in అప్రేరణ also. వాడు భయముతో కంపించెను. He shook with fear.

4. Some roots optionally take the termination చు or పు to denote the Causal sense.

పూను to strive పూనుచు or పూనించు to make another to strive

తేలు to float తేలుచు or తేలించు to make anothrr to float

మగుడు to return మగుడుచు or మగిడించు to make another return

కుదురు to settle, to become fit. కుదురుచు, కుదురించు to make something settle; to cure.

విను to hear వినుచు or వినిపించు to make another to hear

మాను to desist మానుపు or మానుచు to make another to desist.

మను to live మనుచు or మనుపు to make another to live. Roots మాను and మను do not take ఇంచు in the causal sense.

5. Roots అడగు, కరగు, కలగు, నలగు etc. take చు and roots మాయు, కడచు, కుడుచు etc take పు optionally to denote the causal sense.

ఆగు takes చు, పు and ఇంచు also

విరుగు takes చు alone

చూచు, నేరుచు, మేయు, లేచు, కలియు, తడియు and తెలియు take పు alone

Before చు or పు all the above roots drop the final letter.

అడగు to bend down అడచు or అడగించు

కరగు to melt కరచు or కరగించు

నలగు to become powder నలచు or నలగించు

మాయు to fade, to become dirty మాపు — మాయించు

కడచు to pass కడపు

కుడుచు to eat కుడుపు — కుడిపించు

ఆగు to stop ఆపు or ఆగించు

విరుగు to break విరుచు

చూచు to see చూపు

నేరుచు to learn నేరుపు

మేయు to greaz మేపు

లేచు to get up లేపు

కలియు to mix, to meet కలుపు

తడియు to become wet తడుపు.

6. Before the causal terminations చు and పు the ఇ in the roots is changed to ఉ

తడియు to become wet తడుపు

తెలియు to know తెలుపు

7. Before the causal termination ఇంచు the roots అను, కను, తిను and విను take పు. మాను takes it optionaly.

తిను to eat తినిపించు (తిను + పు + ఇంచు)

అను to say అనిపించు.

కను to see కనిపించు (కానిపించు also).

8. Before the causal termination చు the final డు of ఆడు, ఓడు and కూడు is changed to రు.

ఆడు to play, to move ఆరుచు, ఆడించు.

కూడు to meet కూరుచు, కూడించు.

ఓడు to be defeated ఓరుచు to endure ఓడించు.

9. The root చెడు takes either చు or పు in the causal and before them changes the final డు to రు చెడు to spoil చెరుచు or చెరుపు.

10. The root పడు takes చు in the causal and changes the final డు to రు before it.
పడు to fall, to undergo పరుచు
When పడు forms the second part of a శబ్దపల్లవ it takes ఇంచు also.

వెలువడు to come out వెలువరుచు or వెలువరించు.

11. When the causal termination ఇంచు is added the final చు of roots is changed to పు.

వలచు to love వలపించు.

వచించు to tell వచింపించు.

పిలుచు to call పిలిపించు.

The చు of హెచ్చు is not changed to పు before ఇంచు to increase: హెచ్చు – హెచ్చించు.
The change is optional in the case of the root మెచ్చు to praise : మెచ్చించు, మెప్పించు.

12. Some irregular causal bases of roots are given below :
అగు to happen, to be కావించు.

వచ్చు to come రావించు, రప్పించు.

నొచ్చు to feel pain నొంచు, నొప్పించు.

పెరుగు to increase పెంచు.

మునుగు to drown ముంచు.

చొచ్చు to enter చొప్పించు, చొనుపు.

చినుగు to be torn చించు to tear.

త్రెగు to be cut త్రెంచు, త్రెంపు.

తిరుగు to wander త్రిప్పు.

చచ్చు to die చంపు to kill.

నిలుచు to stand నిలుపు.

పోవు to go పుచ్చు, పనుచు, పంచు, పంపు.

When పోవు is the second part of a శబ్దపల్లవ it becomes పుచ్చు only in the causal form.

మోసపోవు to be deceived మోసపుచ్చు.

When కొను is the second part of a శబ్దపల్లవ it becomes కొలుపు in the causal form.

మేలుకొను to wake up మేలుకొలుపు.

13. When once ఇంచు is added to the root to denote the causal sense ఇంచు should not be added again. It can be added to causal forms ending in చు or పు.

వచించు to tell (Here ఇంచు is not added to denote the causal sence Therefore ఇంచు can be added to it) వచింపించు.

చచ్చు — చంపు (causal) చంపించు.

విరుగు — విరచు (causal) విరిపించు.

## NOUNS

కమసాలి (కంసాలి) M. _ Goldsmith.

కవిత్వము N. _ Poetry.

గాయకుడు M. _ Musician.

చక్రము N. _ Wheel. రథము N. _ Chariot.

దిక్కు N. _ Direction. రావణుడు M._King of Lanka

దేవతలు M.F _ Gods. వరము N. _ Boon.

నగ N. – Jewel.
నేర్పు N. – Skill.
బాణము N. – Arrow.
సేన N. – Army.
వాలి M. – King of of the monkeys.
వడి N. – Quickness.
సభ N. – Assembly.
సంగీతము N. – Music.
స్వర్గము N. – Heaven.

గాయకుడు సంగీతము పాడి సభను రంజించెను.

సీతలేని పర్ణశాలను చూచినప్పుడు రాముని గుండె భేదిల్లెను.

రాముడు ఒక్క బాణముచే వాలి హృదయము భేదించెను.

గాలి వడిగా వీచుటచే వృక్షములు కంపించెను.

రాముడు రావణుని చంపినప్పుడు దేవతలు స్వర్గమునుండి పువ్వులవాన కురియించిరి.

జ్వరము వచ్చుటచే అమ్మ నాచే జావ త్రాగించెను.

నేను తమ్మని (చే) అన్నము తినిపించితిని.

ఆ సంగీతము ఏ దిక్కునుండి వినిపించుచున్నది ?

ఇంటినుండి వెళ్ళు బావను మగిడించి తీసికొని వచ్చితిని.

నిన్నవచ్చిన యోగి నీటిపై శిలలను తేలించెను.

"దేవా ! నాబాధ మాన్పి నన్ను మనుచుము" అని గజము విష్ణువును ప్రార్థించెను.

వానవచ్చి దుమ్మను అడచివేసినది.

The goldsmith melted the gold and prepared jewels with it.

The boons that Kaika asked perturbed the mind of Dasaratha.

Who sent Rama to the forest? Is it Dasaratha or Kaika?

Bheema broke (విరిచు) the hands and legs of Baka and killed him.

Krishna got Karna killed by Arjuna when he was trying to rai e the wheels of his chariot.

The teacher stopped the boy and showed him the letter which his father wrote.

My mother woke me up when I was sleeping.

My grand father taught me writing poetry.

Hanuman returned from Lanka and (let Rama know)

informed Rama that he saw Sita at Lanka.

Rain has made my clothes wet.

Rama collected army with the help of Sugreeva and defeated Ravana.

If you try to spoil others you will be spoiled.

-X-

# 19th Day

## CASUAL VERBS (Continued)

1. Intransitive verbs become transitive when they are used in the causal sense.

   రావణుడు చచ్చెను.

   రాముడు రావణుని చంపెను.

2. The subject in అప్రేరణ (స్వార్థ) becomes the object in ప్రేరణ and is put in the objective case.

3. In the case of Transitive verbs the Subject is put in the Objective or the Instrumental case in ప్రేరణార్థ.

   కృష్ణుడు పాలు త్రాగెను.
   తల్లి కృష్ణుని పాలు త్రాగించెను.
   తల్లి కృష్ణునిచే పాలు త్రాగించెను.

4. Sometimes the Subject in అ ప్రేరణ is put in the Genitive case in ప్రేరణార్థ.

   When the causal forms of the roots కను, విను, చూచు etc. are used the Subject in the అ ప్రేరణ is always put in the Genitive case in ప్రేరణార్థ.

రాముడు హనుమంతుని వలన సీతవార్త ఎరిగెను.

హనుమంతుడు రామునకు సీతవార్త ఎరిగించెను.

హనుమంతుడు రామునకు సీతవార్త వినిపించెను.

మిత్రుడు నాకు పుస్తకము చూపెను.

## ROOTS

ఉండు to be; ఉంచు to place.

పారిపోవు to run away.

మెచ్చు to appreciate; మెచ్చించు, మెప్పించు to make another to appreciate.

వలచు to love; వలపించు to make another to love.

హెచ్చు to increase; హెచ్చించు (cause) to increase.

## NOUNS

అర్జునుడు M. = The third of the Pandavas.

ఇటు-అటు(Adv.) = Hither and Thither.

ఉంగరము N. = Ring.

కవి M. = Poet. కావ్యము N. = Poem.

గారడీవాడు M. = Juggler.

ధర N. = Price. నైపుణ్యము N. = Skill.

పాండవులు M. = Sons of king Pandu.

పిల్ల F. N. = Girl; young one.

బల్ల N. = Table.

ముక్క N. = Piece.

వర్తకుడు M. = Merchant.

సభ్యుడు M. = Member.

సుభద్ర F. = Wife of Arjuna.

తల్లి మొదట కొన్నిమాటలు అని పిల్లచే అనిపించెను.

కవి కావ్యము వ్రాసి వెలువరించెను.

గురువు శిష్యులను ఇంటికి పిలిపించెను.

సుభద్ర అర్జునుని వలచి వలపించెను.

వర్తకులు వస్తువుల ధరలు హెచ్చించిరి.

గాయకుడు సంగీతముచే సభ్యులను మెప్పించెను.

పేదలకు ఉపకారము కావించుటకు యత్నింపుము.

రావణుడు పలికిన పలుకులు సీతహృదయము నొప్పించెను.

మా నాన్న చెల్లెలిపెండ్లికి పలువురు కవులను రప్పించెను.
(రావించెను)

వాలి రావణుని తన తోకకుకట్టి నాలుగు సముద్రములలో
ముంచెను.

మంచి అన్నది పెంచుమన్నా !

ఆ పుస్తకమును బల్లపై ఉంచుము.

The mad man tore his shirt into pieces.

The ox broke the ropes and ran away.

The boy is turning his head this side and that side.

Rama killed many Rakshasas when he was living in the forest.

I stopped my friend in the way and requested him to come with me.

Sugreeva sent the monkeys to all directions to scarch for Sita.

Do not try to deceive others.

Viswamitra awakend Rama and Lakshmana who were sleeping.

Krishna made the Pandavas kill the Kauravas in the battle.

My friend used to make me hear his verses before sleeping.

The juggler shoued his skill and pleased the people that were seeing.

Hanuman showed the ring given by Rama to Sita.

— —

# 20th Day

## PASSIVE FORMS
(కర్మణి ప్రయోగము)

1. The passive base of a root is formed by adding పడు (బడు) to the Infinitive form (తుమున్నర్థకము).

చేయు — చేయన్ — చేయబడు

చంపు — చంపన్ — చంపబడు

2. To change the Active Voice into Passive Voice the subject in the Active Voice is put in the Instrumental case and the object in the Nominativ case.

రాముడు రావణుని చంపెను
(Subject) (Object)
రామునిచే రావణుడు చంపబడెను

మిత్రుడు అన్నము వండుకొనెను
(Subj) (Object)
మిత్రునిచే అన్నము వండుకొనబడెను

3. In a sentence denoting causal sense the subject in అప్రేరణ is put either in the Instrumental or the objective case when the root happens to be Transitive. కృష్ణుడు పాలుత్రాగెను (అప్రేరణ)

తల్లి కృష్ణుని పాలు త్రాగించెను. (ప్రేరణము)

When the Subject is put in the objective case there will be two objects to the causal Verb. Then either the Direct object or the Indirect object may be put in the Nominative case in the Passive Voice.

కృష్ణుడు తల్లిచే పాలు త్రాగింపబడెను.

Here the Indirect object is put in the Nominative case.

తల్లిచే కృష్ణునిచే పాలు త్రాగింపబడెను.

Here the Direct object is put in the Nominative case.

When the Direct object is put in the Nominative. Case the Indirect object is put in the Instrumental case.

4. Some Verbs have two objects. They are called Factitive Verbs.

యాచకుడు రాజును ధనమును యాచించెను.

రాజును Indirect; ధనమును Direct.

To change a sentence having a Factitive Verb into Passive voice either the Direct or the Indirect object is put in the Nominative Case and the Subject in the Instreemental Case. When one object is put in the Nominative case the other remains in the objective case itself.

యాచకునిచే రాజు ధనమును యాచింపబడెను

Ind. object is put in the Nom. Case.

యాచకునిచే రాజును ధనము యాచింపబడెను.

Direct object is put in the Nom. Case

ROOTS

దొంగిలించు To steal

మ్రింగు To swallow

విరుగగొట్టు To break

శిక్షించు To punish

## NOUNS

అయిదు Num. Adjective five

కాళిదాసు M. Sanskrit Poet

కృష్ణుడు M. Lord Krishna

గొలుసు N. Chain

తిరిగి Adv. Again

తోట N. Garden

నాడు N. Day

పండ్రెండు Num. Adj. Twelve

భజన N. Worship.

ముని M. Sage

రూపాయ N. Rupee

లేడి N. Deer

సేవకుడు M. Servent

నిన్న వచ్చిన పుస్తకములు అమ్మబడినవి.

విభీషణుడు రామునిచే రాజు కావింపబడెను.

రామునిచే మిత్రునిచే ధనము ఇప్పింపబడెను.

అన్నచే భార్య మందు తినిపింపబడెను.

పేదవానిచే నేను ధనము యాచింపబడితిని.

నిన్న సంతనుండి తీసికొని రాబడిన కూరలు. నేడు అమ్మచే వండబడినవి.

నాన్నచే చాకలివానిచే బట్టలు ఉతికింపబడెను.

కోతిచే కొమ్మ విరుగగొట్టబడుచున్నది.

రాజుచే దొంగ శిక్షింపబడును.

ఆదివారమునాడు భజన చేయబడును.

సభ్యులచే గాయకునిచే కీర్తనలు పాడింపబడెను.

Ramayana is being read by my father every day.

The money had been stolen by the thief.

Sinners will be punished by God.

The drama written by Kalidasa should be witnessed by us.

The boys were made to read till 12 o'Clock in the night.

The son of the teacher who died was made to live again.

When my father was asked money by the poor boy ten rupees were given to him.

My brother was made to swallow the medicine by my mother.

Fruits are being brought by the servant from the garden.

When Rama and Lakshmana were taken by the sage Viswamitra, they were made to wake up at five o' Clock in the morning.

When are the chains broken ?

The deer was killed by the arrow that was thrown by Rama.



# 21st Day

## COMPOUNDS 1

## సమాసములు ౧

1. The Combination of two words having two different meanings into one word with one meaning predominating is called a compound (సమాసము).

2. A compound thus formed may further be compounded with another word or compound and this may again become the member of another compound. Here only simple compounds having only two members are given.

3. The former member of a compound is called పూర్వపద and the latter ఉత్తరపద. In a compond the case ending of the పూర్వపద is omitted and the last member alone takes the case termination required by its grammatical position in a sentence.

4. In a few cases however పూర్వపదs retain their case endings and such compounds are called the అలుక్సమాసములు (అలుక్ = Having no omission).

5. Expressing the various relations existing between the objects or ideas denoted by the members of a compound by meons of proper cases or subordinate sentences is called giving విగ్రహవాక్యము.

6. In Telugu, compounds are classifid into three classes according to the nature of the words used in them.

(a) సాంస్కృతిక సమాసము in which both the members are either Sanskrit or Tastama words.

అధిక భయము (Siddha Samskritika)
అధికపు భయము (Sadhya Samskritika).

(b) ఆచ్ఛిక సమాసము in which both the members are Telugu words.

తెల్ల గుఱ్ఱము.

(c) మిశ్రసమాసము in which one of the members is Tatsama and the other Telugu.

వాడి బాణము; బాణపు మొన.

Telugu words should not be compounded with pure Sanskrit words. But they can be compounded with them after they (Sanskrit words) are given the Tatsama form. బాణమొన is wrong as బాణ is a Sanskrit word and మొన a Telugu word. బాణపుమొన is correct as బాణము the original form of బాణపు is Tastama. We ccme across such wrong compounds in spoken Telugu.

అనేకసార్లు; శుద్ధతప్పు; ఆర్థిక ఇబ్బంది etc. are examples.
It is better to avoid such compounds as far as possible.

7. From the point of view of the meaning compounds are divided into six classes.

(a) తత్పురుష సమాసము.

(i) In this compound the meaning of the ఉత్తరపద predcminates.

(ii) The పూర్వపద takes one of the oblique cases when the compound is dissolved.

(iii) The Negative particle న (which is changed into అ before a consonant and అన్ before a vowel) may be compounded with any Noun and this is called the నఞ్ తత్పురుషము.

కడకన్ను - కంటియొక్క కడ - ప్రథమాతత్పురుషము.

నెలతాల్పు - నెలను ధరించువాడు - ద్వితీయాతత్పురుషము.

నెలతక్కువవాడు - నెలచేత తక్కువవాడు - తృతీయా తత్పురుషము.

దేవరమేలు - దేవరకొరకు మేలు - చతుర్థీ తత్పురుషము.

దొంగభయము-దొంగవలన భయము-పంచమీ తత్పురుషము.

రామునిబాణము-రామునియొక్క బాణము-షష్ఠీతత్పురుషము.

మాటనేర్పు - మాటయందు నేర్పు - సప్తమీ తత్పురుషము.

అజ్ఞానము - జ్ఞానముకానిది - నఞ్తత్పురుషము.

(b) కర్మధారయ సమాసము. When in a compound one of the two words or both the words happen to be Adjectives, or when comparison, imagination (సంభావన) or identification (అవధారణ) is implied it is called a కర్మధారయ compound.

పెద్దగొడుగు - పెద్దదైన గొడుగు - విశేషణ పూర్వపద కర్మధారయము.

Here the పూర్వపద - పెద్ద - is an adjective.

కపోతవృద్ధము-వృద్ధమైన కపోతము-విశేషణోత్తర పదకర్మధారయము.

Here the ఉత్తరపద — వృద్ధ — is an adjective.

మృదుమధురము - మృదువును మధురమును - విశేషణోభయ పదకర్మధారయము

Here both the words మృదు and మధుర are adjectives.

ముఖపద్మము - పద్మమువంటి ముఖము - ఉపమానోత్తర పదకర్మధారయము

Here పద్మ is the ఉపమాన.

తేనెమాటలు - తేనెవంటి మాటలు-ఉపమాన పూర్వపదకర్మ...

Here తేనె the పూర్వపద is the ఉపమాన.

మామిడిచెట్టు—మామిడి అను చెట్టు-సంభావనా పూర్వపదకర్మ...

విద్యాధనము-విద్యఅనెడి ధనము-అవధారణా పూర్వపదకర్మ...

This is also called రూపకసమాస. In this the ఉపమేయ (విద్య) is identified with the ఉపమాన (ధనము).

When the adjective in the Karmadharaya happens to be a numerical adjective it is called ద్విగుసమాస.

మూడుపూవులు; ఆఱుకాయలు.

## ADJECTIVES (విశేషణములు)

i Adjective is a word used with a noun to add something to its meaning. It particularises, defines or describes a person, place or thing.

ii An Adjective qualifies a noun in Number, Gender and Case.

iii అగు, ఐన or అయిన may be added to adjectives మధురము అగు; మధురము అయిన ఫలము.

When these are added Nouns give adjectival meaning. అందము అగు = అందమగు; అందమైన; వేగమైన etc.

iv ని is optionally added after adjectives of quality like నల్ల, తెల్ల etc. నల్లని, తెల్లని.

v వాడు (M). or అది (F, N.) in the Singular and వారు (M, F.) or అవి (N.) in the Plural are added after some adjectives to indicate the gender.

పెద్దవాడు - పెద్దవారు.

పెద్దది - పెద్దవి.

Some adjectives.

అధికము _ great ;

అల్పము _ little

ఎక్కువ _ more

ఎర్ర - red

కొలది - few ; small

చిన్న - small ; young

చెడ్డ - bad

తియ్య _ sweet

తెల్ల _ white

నల్ల - black.

నిర్మలము _ pure.

పచ్చ - green.

పవిత్రము - sacred.

పెద్ద - big.

భక్తుడు _ devotee.

భయంకరము - fearful.

మంచి - good.

మధురము - sweet.

మృదువు - soft.

వికృతము - ugly.

సుందరము - beautiful.

ROOTS

అంటించు _ to set fire

జోక్యముకలిగించుకొను – to interfere

ఎదుర్కొను - to attack

పాడుచేయు - to destroy

ఓదార్చు - to console

భావించు - to think.

అచ్చెరువు (N.) -Surprsie;

ఇంద్రజిత్తు – Eldest son of Ravana

ఉత్సాహము (N.) - Enthusiasm.

ఓటమి(N.) - Defeat.

గుడ్డముక్కలు (N.) _ Pieces of cloth.

జ్యేష్ఠకుమారుడు (M.)- Eldest son.

తోక - Tail (హనుమంతుని తోక Tail of Hanuman).

పరాజయము - Defeat.

రామదూత (M.)- Messenger of Rama.

వినయసంపద (N.) _ Wealth of modesty.

వెంటనే (Adv.) - Immediately.

రామభక్తుడు (అయిన) హనుమంతుడు భయంకర సముద్రమును దాటి లంకాద్వీపము చేరెను.

అతడు చిన్న రూపము ధరించి రాముని భార్య అయిన సీతకొరకు వెదకెను.

సీత అశోక వృక్షము క్రింద వికృతలైన రాక్షసస్త్రీల నడుమ కూర్చుండెను.

శాంత సుందరము అయిన ఆమె ముఖపద్మము చూచి అతడు ఆమెయే సీత అయియుండునని భావించెను.

రాక్షసస్త్రీలు నిద్రించుచున్నప్పుడు అతడు చెట్టు కొమ్మ మీద కూర్చుండి రామునికథ గానముచేయ నారంభించెను.

మృదుమధురమైన ఆ గానము వినబడినప్పుడు సీత హృదయము అధిక సంతోషము పొందెను.

హనుమంతుడు మెల్లగా చెట్టుకొమ్మనుండి దిగి సీత ఎదుట నిలబడెను.

మొదట సీత రావణుడే కోతి రూపము ధరించి అక్కడికి వచ్చి ఉండునని తలంచి భయపడెను.

హనుమంతుడు ఆమెకు నమస్కరించి రామునివార్త ఎరింగించెను.

అతని మాట నేర్పు వినయ సంపద చూచి సీత తనకు మంచి రోజులు వచ్చెనని భావించెను.

అతడు సీతకు రాముని ఉంగరము ఇచ్చి కొలది రోజులలోనే రాక్షసభయము తొలగునని ఓదార్చెను.

రావణుడు రెండు నెలలు మాత్రము గడువు ఇచ్చెనని అతనికి తెల్పి సీత రాముని వానరసేనతో వెంటనే లంకకు రప్పింపుమని ప్రార్థించెను.

Hanuman wanted to know the strength of Ravana.

He broke the branches of the Asoka trees and destroyed the garden.

Ravana's servants went and informed him of the great valour of Hanuman.

Ravana became angry and sent Rakshasa armies to kill him.

The Rakshasa armies went and attacked Hanuman with great enthusiasm but were killed by him.

The news of the defeat of his armies astonished Ravana who sent his eldest son Indrajit to kill Hanuman.

As Indrajit could not kill him he bound him with Brahmastra and brought him to the court of Ravana.

Ravana asked Hanuman "who are you? From whom do you come; why did you distroy the garden and kill the Rakshasas?"

Hanuman replied that he was Rama's messenger and that he had to kill the Rakshasas to protect himself.

Hanuman also told him about the greatness of Rama and advised him to send back Sita immediately if he wanted to live.

When Ravana wanted to kill him out of great anger Vibhishana, his brother, interfered and said that messengers should never be killed.

Ravana asked his servants to tie some pieces of cloth to the tail of Hanuman and set fire to it.

——

# 22nd Day

## COMPOUNDS (contd)

1. In a Dwandwa compound all the members have equal importance.

2. The Dwandwa compound is generally in the Plural Number.

   రామలక్ష్మణులు ; తల్లిదండ్రులు.

3. Bahuvrihi is a compound in which importance is given to something outside the words of the compound.

   చక్రపాణి = Vishnu.

   నలువ (Person having four faces) Brahma.

4. When dissolved it is generally explained by adding కలవాడు, కలవారు, కలది or కలవి according to the number and gender of the meaning denoted by the compound.

   చక్రపాణి - చక్రము పాణియందు కలవాడు - విష్ణువు.

   నలువ - నాలుగు ముఖములు కలవాడు - బ్రహ్మ.

   పద్మాక్షి - పద్మములవంటి అక్షులు కలది - స్త్రీ.

   కృతాపరాధము - చేయబడిన అపరాధముకలది.

5. The particle సహ, Which is optionally changed to స, is compounded with a noun which takes the Instrumental case and forms a Bahuvrihi compound. This is called సహపూర్వపద బహువ్రీహి.

   సపుత్రుడు - పుత్రునితో కూడినవాడు.

6. An Avyayibhava compound contains two members the first of which is generally an Adverb. This begins with యథా, ప్రతి, ఆ, ఉప and other adverbs and is mostly సాంస్కృతిక. when dissolved, other words have to be used to explain it.

ప్రతిదినము - దినము దినము - Daily.

యథాశక్తి - శక్తిని అతిక్రమింపకుండ. యథావిధి; యథాశాస్త్రము; యథాపూర్వము etc.

ఆబాలగోపాలము - బాలురు మొదలుకొని గోపాలుర వరకు; ఆసేతు హిమాచలము; ఆ చంద్ర తారార్కము.

7. The whole అవ్యయీభావ is generally an Adverb.

Some more Adjectives.

| M. | F. | N. |
|---|---|---|
| క్రూరుడు | క్రూర | క్రూరము - cruel. |
| దుష్టుడు | దుష్ట | దుష్టము - bad, wicked. |
| సాధువు | సాధువు | సాధువు - good. |
| చపలుడు | చపల | చపలము - wavering. |
| ఘనుడు | ఘన | ఘనము - great. |
| కుటిలుడు | కుటిల | కుటిలము - wicked. |
| కఠినుడు | కఠిన | కఠినము - crooked, hard. |

వంకర = curved.

ఉచితము
యుక్తము } Proper

ఓర = Side; ఓరచూపు = Side glance.

గట్టి = Hard.

మృదులము, మృదువు = Soft.

దట్టము = Thick.

లఘువు = Light.

తిన్న = Straight.

వదులు = Loose.

స్థిరము = Firm.

హీనము = Mean.

నెర = Perfect.

మలినము = Dirty.

ముద్దు = Dear.

## ROOTS

కలసిమెలసి ఉండు _ To live intimately.

గ్రహించు _ To take, to accept, to understand.

చిక్కిపోవు _ To become emaciated.

నిలుపు (నిలుచు - నిలుపు Casual) _ To stop, to maintain, to establish.

సంహరించు _ To kill.

కాలినడక (N.) _ Walking by foot.

రాజ్యము (N ) Kingdom.

లక్ష్మి (F.) _ Goddess of prosperity.

స్వర్గము (N.) _ Heaven.

రామలక్ష్మణులు తండ్రిమాట నిలుపుటకై అడవికి అరిగి దుష్టులైన రాక్షసులను వాడి బాణములతో సంహరించిరి.

రాముడు సభార్యుడై అడవికి అరుగునపుడు అయోధ్యలోని ప్రజలు ఆబాలగోపాలము మిక్కిలి దుఃఖించిరి.

విష్ణువు చక్రపాణి; రాముడు కోదండపాణి; శివుడు శూలపాణి.

మూడు కన్నులుకలవాడు అగుటచే శివునికి ముక్కంటి అను నామము కలిగినది.

సీత అత్తమామలను అతి భక్తితో సేవించెను.

మానవులు అందరు అన్నదమ్ములవలె కలసిమెలసి వర్తించునపుడు ఈ లోకమే స్వర్గలోకము అగును.

మహాత్ముల హృదయములు శిలలకంటె కఠినములు; పువ్వులకంటె మృదులములు.

సాధుహింస చేయరాదు; వంకరమాటలు పలుకరాదు.

శంకరాచార్యులు ఆసేతుహిమాచలము కాలినడకతో తిరిగి వచ్చెను.

శూర్పణఖ సుందరాకారముతో వచ్చి రాముని ఓరచూపులతో చూడ మొదలిడెను.

ఆమె కుటిల రాక్షసి అని గ్రహించి రాముడు ఆమెను తిన్నగా వచ్చినదారిని పొమ్మని కోరెను.

నిర్మల హృదయ ఐన శబరి తన ఆశ్రమమునకు వచ్చిన రామలక్ష్మణులను యథావిధిగా పూజించెను.

Rama displayed great respect towards his parents.

Nala and Damayanti had to leave the kingdom and go to the forest on account of bad fate.

They had to live among cruel animals wearing dirty clothes.

The goddess of fortune is fickle-minded and does not live permanently at one place.

My brother went to cinema with his family and took my younger and elder sisters also.

The eyes of deer are very beautiful and ladies who have eyes like those of the deer are called మృగాక్షులు.

Having folded his hands (కృతాంజలి ఐ), Hanuman stood before Sita who was thinking of Rama.

Everyday I go to the market to bring vegetables.

The Pandavas lived for twelve years in thick forests along with their wife.

Sita put the ring given by Hanuman on her little finger.

It was quite loose as she was much emaciated.

Though Karna tried to raise the wheels of his chariot as far as his power permitted (యథాశక్తిగా) he could not do so.

Brahma and Saraswati have a swan as their vehicle.

–X–

# 23rd Day

## ADVERBS (అవ్యయములు)

1. Adverbs have no gender, number or case.

2. When గా (కా Infinitive form of the root అగు) is added to Adjectives or Nouns, they give Adverbial meaning.

   సుందరముగా = Beautifully.

   అందముగా = Beautifully.

   వేగముగా = Quickly.

3. Conjunction is a word which merely joins together sentences or words.

   ఉను is a conjuction which joins together words and is generally used after each one of them.

   రాముడును లక్ష్మణుడును = Rama and Lakshmana.

4. Interjection is a word expressing sudden feeling or emotion like joy, grief, surprise or approval.

అవ్యయములు :

అంత = Then; Afterwards; అప్పుడు = Then.

ఇంక = Hereafter; More; Yet; Henceforth.

ఇప్పుడు = Now.

ఎంత = How much.

ఎక్కడ = Where.

ఎడల = In case;

ఎప్పుడు = When.

ఎవ్వరు = Who; ఏది = Which; ఏవి (Pl.)

ఏని = If; ఏన్ = If; Either or.

ఏల = Why.

ఐన = Either or; Though.

## ROOTS

అస్తమించు = To set.

ప్రయాణము + అగు = To start.

వర్ణించు = To describe.

వీచు = To blow.

## NOUNS

ఆహ్వానము (N.) = Invitation,

ఇబ్బంది (N.) = Difficulty.

ఒండొరులను = One another.

చిత్రకారుడు (M.) = Painter.

చిత్రము (N.) = Picture.

చీకటి (N.) = Darkness.

ప్రయాణము (N.) = Journey.

పూర్ణిమ (F.) = Full-moon day.

బహుమానము (N.) = Present, Prize.

కూడ = Also. చల్లగా = Coolly.

చో (Generally used after ఐన) If.

తరువాత, పిమ్మట = Afterwards; తప్పక = Without fail.

సుమా = Indeed.

## CONJUNCTIONS

అంతేకాదు = Not only that.

ఉను = and.

కాని = But; కావున, కాబట్టి = Therefore.

మరియు = Moreover. లేక = Or.

## INTERJECTIONS

ఆహా; హా = Ah!

అయ్యో = Alas; అక్కటా; కటా !

వానలు బాగుగా కురిసినవి కావున ఈ ఏటికి ఇంక నీటి ఇబ్బంది ఉండదు.

మొన్న పరీక్షలకు కూర్చుంటిని కాని జ్వరముచే సరిగా వ్రాయ లేకపోతిని.

సూర్యుడు అస్తమించుచున్నాడు కావున ఇంక ఇంటికి పోవలయును.

నేనైన తమ్ముడైన తప్పక పెండ్లికి వచ్చెదము.

ఇంతవరకు ఎక్కడ ఉంటివి? నీకొరకు వెదకుచుంటిని.

అక్రూరుని ఆహ్వానము వినగానే కృష్ణుడును బలరాముడును మధురకు ప్రయాణమైరి.

నీవు బడికి వెళ్ళుట పాఠములు నేర్చుకొనుటకా లేక ఆటలు ఆడు కొనుటకా?

నీవు త్వరగా రావలయునుసుమా లేనిచో మనకు రైలు అందదు.

దొంగ తప్పుచేసెను కాబట్టి అన్నిదెబ్బలు తినియు ఊర కుండెను.

ఆహా! నేడు గాలి ఎంతచల్లగా వీచుచున్నది!

Alas! many huts in the village were burnt yesterday.

The painter painted the picture very beautifully but could not get the prize.

Rama and Lakshmana could not leave one another. That is why Lakshmana also followed Rama to the forest.

I went to see your teacher yesterday but then he was not in the school.

Alas! the bus ran over the old woman who was walking slowly on the road.

Oh! I can not describe the beauty of the scenery in the garden on the fullmoon day.

Duryodhana had no love towards the Pandavas. Not only that, he wanted to kill them if possible.

Try to know who you are, whence you have come and where you have to go.

Sages do penance in the forest living on leaves and fruits.

Hanuman approached Rama and Lakshmana and told them that he was the minister of Sugriva, the king of the monkeys. Moreover he informed them that Sugriva was wishing to make friends with them.

---

# 24th Day

## IMPORTANT RULES OF SANDHI 1.

1. Sandhi is compulsory in a single word, in a compound, and when Upasarga and a root are combined. But in a sentence it is left to the descretion of the writer.

అయిన; సంఘ + ఔన్నత్యము = సంఘౌన్నత్యము;
ప్రతి + ఈక్షించు = ప్రతీక్షించు.

2. There are some places where Sandhi is natural and where it is observed even in the spoken language. It is proper to observe Sandhi in such cases and in other cases it is advisable to observe విసంధి (ie) to keep the letters as they are without affecting Sandhi.

3. Sandhi is compulsory–

(a) When the first word ends in ఉ and the second word begins wilh any vowel except ఋ.

రాముడు + ఎక్కడ = రాముడెక్కడ.
వనము + అక్కడ = వనమక్కడ.

(b) When a word beginning and ending in a vowelr is repeated.

ఆహా + ఆహా = ఆహాహా.
ఓహో + ఓహో = ఓహోహో.
ఔర + ఔర = ఔరౌర.

(c) When a word ends in a vowel and is followed by a non-word (అపద) beginning with a vowel:

మూర + ఎడు = మూరెడు.
వీసె + ఎడు = వీసెడు.

(d) When names ending in vowels are followed by అయ్య, అమ్మ, అన్న or అక్క.
రామ + అయ్య = రామయ్య; రామ + అన్న = రామన్న.
సీత + అమ్మ = సీతమ్మ; సావిత్రి + అక్క = సావిత్రక్క.

(e) When a verb in the Second Person ending in ఇ is followed by any vowel–

వచ్చితివి + అని = వచ్చితివని.
వెళ్ళితిరి + ఏల = వెళ్ళితిరేల.

4. Sandhi is optional :–

(a) When the first word happenes to be a ద్రుతప్రకృతిక ending in ఉ.

వచ్చుచు(న్) + ఉన్నాడు = వచ్చుచున్నాడు; వచ్చుచునున్నాడు.
నాకు(న్) + అతడు = నాకతడు: నాకునతడు.
నాయందు + అతనికి = నాయందతనికి; నాయందునతనికి.

(b) When the first word ends in ఋ and is followed by any vowel.

మేన + అత్త = మేనత్త; మేనయత్త.
పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు; పుట్టిన యిల్లు.
చూడక + ఉండెను = చూడకుండెను; చూడకయుండెను.

Exception: When the first word ending in అ happens to be a తత్సమ, a Nominative of address or a Noun in the feminine gender, Sandhi should not be observed.

దూత + అతడు = దూతయతడు.
మిత్రమ + ఇటు = మిత్రమ యిటు.
అమ్మ + ఇచ్చెను = అమ్మ యిచ్చెను.

(c) When words like ఏమి, మరి, కి, అది, అవి, ఇది, ఇవి, ఏది and ఏవి ending in ఇ and verbs ending in ఇ are followed by a word beginning with a vowel.

ఏమి + అని = ఏమని; ఏమియని.
అది + ఎక్కడ = అదెక్కడ; అది యెక్కడ.
వచ్చిరి + అని = వచ్చిరని; వచ్చిరి యని.

5. In cases where there is no Sandhi, when a word which is a Kala ending in a vowel is followed by another word or a Nonword beginning with a vowel, య్ is inserted between them.

అమ్మ + ఇచ్చెను = అమ్మయిచ్చెను (అమ్మ + య్ + ఇచ్చెను).
హరి + అందు = హరియందు.
నా + అందు = నాయందు.

When అవ (Non-word) follows a Noun ending in ఇ Sandhi is optional.

పది + అవ = పదవ, పదియవ Tenth.

When the first word happens to be a ద్రుత ప్రకృతిక either Visandhi may be observed or న్ is naturally inserted between the two words.

రామునిచేత + అతడు = రామునిచేత అతడు,
రామునిచేత నతడు.

6. క, చ, ట, త and ప coming after a ద్రుత ప్రకృతిక are optionally changed to గ జ డ ద and బ respectively. This change is compulsory when they follow Infinitive forms.

పూచెను పూవులు; పూచెను బూవులు
తోచెను చుక్కలు; తోచెను జుక్కలు.
చేయ(న్) కలడు = చేయగలడు
చూడ(న్) పడెను = చూడబడెను.

7. When a తద్ధర్మ Participle or the first member of a షష్ఠీ తత్పురుష ending in ఉ is followed by a word beginning with a vowel న్ is inserted between them.

చేయు + అతడు = చేయునతడు
చేసెడు + అతడు = చేసెడునతడు
రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ

In the latter case Visandhi may also be obssrved రాజు ఆజ్ఞ.

## ROOTS

అను = To say; To call

అరుదెంచు = To come

(కొని + పోవు)కొంపోవు = To take.

దెబ్బలు + ఆడు = To fight; To quarrel

బలవంతము + చేయు = To force; To insist

## NOUNS

అనువు (N.)

అనారోగ్యము (N.) = Ill-health

అమరపురి (F.) = Heaven

అరటిపండ్లు (N.) = Plantain fruits

ఆనపకాయ (N.) = Snake melon

కొంచెము (Adj.) = Little

కొండ (N.) = Hill; Sky

కొదువ (N.) = Inferiority

జాతి (N.) = Tribe; Caste

తోటకూర (N.) = Leafy vegetable

పసులు (N.) = Cattle

పూజ (N.) = Worship

పొరుగు (Adj.) = Neighbouring

బుట్ట (N.) = Basket

వంకాయ (N.) = Brinzal.

వర్ణము (N.) = Colour; caste.

వేఱు (Adj.) = Different

శ్రీనాథుడు (N.) = Name of a great Telugu Poet.

మా పొరుగింటి వారందరు నిన్న కాశి కరిగిరి. వారెప్పుడు తిరిగివత్తురో మేమెరుగము.

నీవిపుడు సంత కరిగి రెండు డానపకాయలును మూడణాల తోట కూరయు బుట్టెడరటి పండ్లును తెమ్ము.

పసుల వన్నె వేరు పాలేకవర్ణమౌ
పుష్పజాతి వేరు పూజ ఒకటి
అనువుకానిచోట అధికుల మనరాదు
కొంచెముండుటెల్ల కొదువ కాదు
కొండ అద్దమందు కొంచెమై ఉండదా.

ఓహోహో! పున్నమ వెన్నెల అందమేమని వర్ణింతును!

జ్వరముతో బడికి ఎందుకు వెళ్ళితివని మా అన్నయ్య కోప పడినాడు.

మా అబ్బాయికి తెల్లని వన్నియు పాలు నల్లని వన్నియు నీళ్ళు.

అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి.

నావలన అతనికెట్టి అపకారమును జరుగబోదు.

మా నాన్నగారు ఆరవ ఏట నన్ను బడియందు చేర్చి యుండిరి.

'పొరుగూరినుండి ఎప్పు డరుదెంచితివి. ఏమేమి తెచ్చితివి' అని మా అన్నను అడిగితిని.

Who gave this book to you ?

My elder brother gave this book to me.

Abhimanyu is the son of Arjuna and the nephew of Srikrishna.

This house is ours and that (house) is theirs.

I sold one vis brinzals.

Many Rakshasas were killed by Rama in the battle.

My mother asked me what I did in the temple.

Rama would not have gore for the golden deer if Sita had not compelled him to do so.

In those days my elder sister and her mother-in-law were frequently guarrelling with one another.

Your father's sister told me about your ill-health.

Alas! Alas! that house is being burnt.

Dasaratha cried in grief, "Rama, do not go to the forest. Remain in Ayodhya alone. I can not live if you go away."



# 25th Day

## RULES OF SANDHI II (Continued)

1. ము at the end of the first member of a Karmadharaya Compound and sometimes of a Tatpurusha Compound is changed to పు or ంపు.

   సరసము మాట=సరసపుమాట; సరసంపుమాట.

   సింగము పిల్ల = సింగపుపిల్ల; సింగంపుపిల్ల

   కన్నము దొంగ=కన్నపు దొంగ; కన్నంపుదొంగ.

2. When the second member of a Karmadharaya Compound and sometimes of a Tatpurusha Compound begins with a vowel and the first member ends with ఉ, టు is inserted between them.

   నిద్దము + అద్దము; నిద్దపు అద్దము; నిద్దపుటద్దము
   (Smooth mirror).
   నెయ్యము + అలుక; నెయ్యపు అలుక; నెయ్యపుటలుక
   (Anger with love).
   రత్నము + ఉంగరము; రత్నపు ఉంగరము; రత్నపుటుంగరము
   గొడ్డు + ఆవు; గొడ్డుటావు (A barren cow)
   కరకు + అమ్ము=కరకుటమ్ము (A sharp arrow)
   వేలుపు + ఆవు = వేలుపుటావు (Cow of the gods)

   The insertion of టు is optional when the first member happens to end in రు as in పేరు, చిగురు, పొదరు.

   పేరు + ఉరము = పేరుటురము; పేరురము Broad chest.

   చిగురు + ఆకు =చిగురుటాకు; చిగురాకు; Tender leaf

   పొదరు + ఇల్లు = పొదరుటిల్లు; పొదరిల్లు; Cottage made of leaves.

3. When the words పేద, బీద, ముద్ద, బాలెంత, జవ, మనుమ, గొడ్డు etc. happen to be the first members of a కర్మధారయ compound and are followed by ఆలు which means a woman in general రు is inserted between them.

పేద+ఆలు; పేద+రు+ఆలు=పేదరాలు A poor woman.

బీద+ఆలు=బీదరాలు.

ముద్ద+ఆలు=ముద్దరాలు.

బాలెంత+ఆలు=బాలెంతరాలు.

జవ+ఆలు=జవరాలు =A young woman.

మనుమ+ఆలు=మనుమరాలు =A grand Doughter.

గొడ్డు+ఆలు=గొడ్డురాలు.

When the first member happens to be a Tatsama and is followed by ఆలు the ending అ is changed to ఉ and then రు is inserted between them.

గుణవంత+ఆలు; గుణవంతు+రు+ఆలు=గుణవంతురాలు.

దుష్ట+ఆలు=దుష్టురాలు; A bad woman

4. క, చ, ట, త, ప in the beginning of the second member of a Dwandwa Compound are changed to గ, స, డ, ద, వ respectively.

కూర+కాయ=కూరగాయలు Vegetables.

తల్లి+తండ్రి=తల్లిదండ్రులు Mother and father

కాలు+చేయి=కాలుసేతులు Leg and the hand

అక్క+చెల్లెలు=అక్కసెల్లెండ్రు Elder sister and the younger sister.

This change, though compulsory according to Grammar, is only optionally obesived.

అతడు పద్యము చదువునపుడు నేను వినలేదు. ఆ పద్యము నర్థము నాకు తెలుపుము.

సైకిలు మీద పోవునత డెవరో ఎరుగుదువా ? అతడు మా మనుమరాలి మగడు.

నకులు డర్జును ననుజుడు; సహదేవు నన్న.

నిన్న సర్కసులో సింహపుపిల్లను చూచితిని. ఏనుగు వచ్చినపు డది ప్రక్కకు పోయినది.

పోలీసులు కన్నపుదొంగను పట్టుకొని ఖైదునకు తీసికొని పోయిరి.

గొడ్డుటావు పిదుక కుండ కొంపోయిన
పండ్లు రాల తన్ను పాల నీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా.

సత్యభామ కృష్ణునిపై నెయ్యపుటలుక చూపెను.
కృష్ణు డామెను ఓదార్చెను.

వేలుపుటావునకు కామధేను వని పేరు.

ఇది కడు ముద్దరాలు పను లేమియు చేయగనేరదు.

గొడ్డురాలికి తెలియునే బిడ్డబాధ ?

"తాటక దుష్టురాలు. అందుచే ఆమెను చంపినను పాపము రాదు"- అని విశ్వామిత్రుడు రామునితో చెప్పెను.

కోకిల చిగురాకులు తిని కమ్మగా కూయుచున్నది.

Arjuna discharged a sharp arrow at Karna who was trying to raise the wheels of his chariot.

Some people speak pleasant words though they are cruel by nature.

The young woman stood before a smooth mirror.

Hanuman gave Rama's ring made of jewels to Sita who sat under the Asoka tree.

Baka gave a blow on the broad chest of Bhima who was eating the food on the cart.

The tiger followed the cow that was going into the cottage of the sage.

My mother called the poor woman going in the street and gave her a saree.

A daughter-in-law who does not have a mother-in-law appears to be a lady full of good qualities (గుణవంతురాలు).

A lady who delivers a child is called a mother in bed (బాలెంతరాలు).

The minister carried out the order of the king.

Sita and Rama are the parents of Kusa and Lava.

The infant is moving his hands and legs and is weeping for milk.

—— ——

# 26th Day

## RULES OF SANDHI-III (Contd.)

1. ర at the end of కురు and చిరు and డ at the end of కడు, నిడు and నడు substitute double ట (ట్ట) for them when a word begining with a vowel follows them.

చిరు + ఎలుక = చిట్టు + ఎలుక = చెట్టెలుక Small rat.

కడు + ఎండ = కట్టు + ఎండ = కట్టెండ Very hot sun.

నిడు + ఊరుపు = నిట్టూరుపు Long sigh.

నడు + ఇల్లు = నట్టిల్లు Middle porton of the house.

2. All the letters (that come) after the first vowel in the following words are omitted when they are compoundep with other words.

లేత + దూడ; లేదూడ A tender calf.

పూవు + దండ; పూదండ A garland of flowers.

క, చ, ట, త, ప that happen to be in the beginning of the second word are changed to గ, జ, డ, ద, బ respectively.

పూవు + తోట; పూతోట; పూదోట

లేత + కొమ్మ; లేకొమ్మ; లేగొమ్మ

మీదు + కడ; మీకడ; మీగడ.

When the words పది and తొమ్మిది are compounded with తొమ్మిది and పది respectively ంద and ంబ are substituted for the initial త and ప in them.

పది + తొమ్మిది; ప తొమ్మిది; పందొమ్మిది Nineteen.

తొమ్మిది + పది; తొ పది; తొంబది Ninety.

3. The words కడ, ఎదురు, చివర, తుద, నడుము, పగలు, బయలు, మొదట etc. are repeated to denote భృశార్థ (Very much or high degree) all the letters that come after the first vowel in the original word substitute ట్ట (Double ట with the vowel అ) for them.

కడ + కడ, క + కడ; కట్టకడ; At the very end.

చివర + చివర; చి + చివర; చిట్టచివర At the very end.

తుద + తుద; తు + తుద; తుట్టతుద.

ఎదురు + ఎదురు; ఎ + ఎదురు; ఎట్ట ఎదురు At the very front.

నడుమ + నడుమ; న + నడుమ; నట్ట నడుమ At the very middle.

పగలు + పగలు; పట్టపగలు In the clear day.

మొదట + మొదట, మొట్టమొదట At the very outset.

బయలు + బయలు; బట్టబయలు Very open.

4. When words are repeated case terminations at the end of the original words are generally dropped.

అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్ Here and there.

ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్ In every house.

ఊరన్ + ఊరన్ = ఊరూరన్ In every village.

The words ఇంచుక and నాడు drop the final letters optionally when they are repeated.

ఇంచుక + ఇంచుక = ఇంచు + ఇంచుక = ఇంచించుక: ఇంచుకించుక Little by little.

నాడు + నాడు; నానాడు Day by day; Gradually.

5. The following words drop the Nominative termination ము optionally.

| | | |
|---|---|---|
| చరిత్రము; | చరిత్ర | History. |
| అభిలాషము; | అభిలాష | Desire. |
| భ్రమము; | భ్రమ | Illusion. |
| వేగము; | వేగ | Speed. |
| హంసము; | హంస | Swan. |

6. When the terminations లు, ల, న follow the ending ము of words is optionally dropped and the preceding vowels are lengthened.

ముత్యము + లు = ముత్య + లు = ముత్యాలు

రంపము + న = రంప + న = రంపాన

వృక్షము + లను = వృక్ష + లను = వృక్షాలను

7. ఆ, ఈ, ఏ are pronouns and are given the name త్రిక which means three. The initial consonants, except శ, ష స, హ and ర, of the words following త్రిక are doubled and when they are doubled ఆ, ఈ, ఏ become short.

| | | |
|---|---|---|
| ఆ + కన్య; | ఆక్కన్య; | అక్కన్య. |
| ఏ + చోట; | ఏచ్చోట; | ఎచ్చోట. |
| ఏ + కడ | ఏక్కడ; | ఎక్కడ. |
| ఈ + కడ; | ఈక్కడ; | ఇక్కడ. |

8. The ending ము of the following words is changed to ప when they are compounded with other words.

పాము + రేడు = పాపరేడు King of the serpents.

జనుము + నార = జనుపనార Fibre of a plant Called జనుము.

వేము + చెట్టు = వేపచెట్టు.
ఇనుము + మార్గము = ఇనుపమార్గము Railway.
మినుము + రొట్టె = మినుపరొట్టె Bread made of black gram.
ప్రేము + సజ్జ = ప్రేపసజ్జ Basket made of cane.

"నేను వలలో చిక్కుకొంటిని. ఈ వల త్రాళ్ళు కొరికి నన్ను కాపాడుము"—అని సింహము చిట్టెలుకను ప్రార్థించెను.
ఆసుపత్రిలో రోగి బాధచే నిట్టూర్పులు పుచ్చుచుండ వైద్యుడరుదెంచి ప్రేప సజ్జలో నుండి మందు తీసి అతనికి ఇచ్చెను.
ఆ మందు తీసికొన్న తరువాత రోగి బాధ ఇంచించుక తగ్గజొచ్చెను. నానాటికి అతని ఆరోగ్యము బాగు పడెను.
పందొమ్మిది రోజులు అయిన తరువాత అతడు అక్కడక్కడ ఆగుచు ఇంటికి నడచి వెళ్ళెను.
అతడు నట్టింట కూర్చుండి చదువుకొనుచుండ ఒకనాడు వైద్యుడు అతనిని చూచుటకు వెళ్ళెను.
రోగి ఇల్లు ఒక పూదోట నట్టనడుమ ఉండెను. ఆ ఇంటికి ఎట్టఎదుట ఒక పెద్ద వేపచెట్టు ఉండెను.
మొట్టమొదట వైద్యుడు రోగి యిల్లు కనుగొనలేకపోయెను.
అత డచ్చటచ్చట తిరిగి తుట్టతుదకు ఆ యింటి దగ్గరకు వచ్చెను.
రోగి వృక్షాల నడుమ నుండి అతనిని చూచి ఎదురుగా వెళ్ళి నట్టింటికి తీసికొని వచ్చెను.
వైద్యుడు ఇనుప కుర్చీమీద కూర్చుండెను. రోగి అతని మెడలో పూదండవేసి నమస్కరించెను.
వైద్యు డచ్చట తొంబది నిమిషములు కూర్చుండెను. రోగి అతనికి ముత్యాల హారము బహుమానముగా ఇచ్చెను.
అతడు మొట్టమొదట దానిని తీసికొనలేదు. కాని రోగి ప్రార్థించుటచే చిట్టచివరికి గ్రహించెను. రోగి ఆ విధముగా తన కృతజ్ఞత వెల్లడించెను.

The cow came running from the field in the very hot sun to see the tender calf that was sleeping under the neem tree.

Krishna went with his friends to the houses of the Gopikas in the clear day and after eating butter and cream drank curd and buttermilk.

The thief stole many valuable things in every house in the village and was pretending to be a gentleman At last he was caught while stealing and his conduct became quite wellknown to everybody.

The police men took him to every village and asked him to show them where and where he stole all the things.

The thief showed a girl that was going to school and said that he had stolen a garland of gold flowers from her neck in the very presence of her friends.

The policemen beat him with iron canes and in the end took him to the prison.

The elephant entered the flower garden and broke the tender branches of many trees.

The swans look like geese. They can separate water from milk but the geese can not do so.

The carpenter cut the tree with a saw and tied the pieces with ropes made of fibre of the జనుము plant.

Even the king of serpents who has two thousand tongues can not describe the taste of the bread of black gram prepared by my grand - mother.

—X—

# 27th Day

## కృత్ప్రత్యయములు

## KRIT AFFIXES (Primary Affixes)

1. The terminations used to form derivative bases in Telugu are of two kinds - కృత్తులు (Primary Affixes) and తద్ధితములు (Secondary Affiixes).

Krit terminations are added to roots and the Nominal bases formed by adding them are కృదంతములు.

Case terminations are added to the కృదంత and Tadhita bases.

2. Some Primary affixes and the changes that the roots undergo when they are added are shown below.

When the కృత్ termenations beginning with క. గ. త, వ and ఇమి are added the ending క, గ, చ, యు and వ of roots are dropped.

| | | | | |
|---|---|---|---|---|
| క | అలుగు | — | అలుక | Anger |
| | ఎరుగు | — | ఎరుక | Knowledge. |
| | నడచు | — | నడక | Gait |
| | పోవు | — | పోక | Going. |
| | మొలచు | — | మొలక | Tender Plant. |
| | వచ్చు(రా) | — | రాక | Coming. |
| | కను(కాను) | — | కానుక | Present. |
| | కినియు | — | కినుక | Anger |

| | | | |
|---|---|---|---|
| ఇమి | కలుగు | కలిమి | Prosperity. |
| | | లేమి opp. | Poverty. |
| | ఓరుచు | ఓరిమి | Patience. |
| | కూరుచు | కూరిమి | Friendship. |
| | ముదియు | ముదిమి | Old age. |
| త | చేయు | చేత | Action. |
| | కూయు | కూత | Crying, Making noise |
| | కోయు | కోత | Cutting. |
| | గీయు | గీత | Line, Drawing, |
| | నేయు | నేత | Weaving. |
| | పోయు | పోత | Pouring. |
| | మూయు | మూత | Covering. |
| | మేయు | మేత | Grazing. |
| | మ్రోయు | మ్రోత | Sound. |
| | రోయు | రోత | Hatred. |
| | వ్రాయు | వ్రాత | Writing. |
| | ఈదు | ఈత | Swimming. |
| కువ | అడగు | అడకువ | Modesty. |
| | మెలగు | మెలకువ | Awaking. |
| | వేగు | వేకువ | Early morning. |
| ట | ఆడు | ఆట. | Play. |
| | ఓడు | ఓట | Defeat; Fear. |
| | పండు | పంట | Crop. |
| | పాడు | పాట | Song. |
| | ఘండ్ఢు | ఘంట | Flame. |

| | | | | |
|---|---|---|---|---|
| టు | When this is added all the letters coming after the first vowel which is lengthened if short, are dropped. | పడు | పాటు | Fall. |
| | | చెడు | చేటు | Ruin, Harm |
| | | కరచు | కాటు | Bite. |
| | | పొడుచు | పోటు | Stroke, Pain. |
| | | ఓడు | ఓటు | Defeat. |
| | | వ్రేయు | వ్రేటు | Stroke. |
| త | ఆవులించు | | ఆవులింత | Yawning. |
| | గిలిగించు | | గిలిగింత | Tickling. |
| వు | మాయు | | మాపు | Fading. |
| | మేయు | | మేపు | Feeding. |
| | కను (కాను) | | కానుపు | Delivery. |
| | చూచు | | చూపు | Sight. |
| | తలచు | | తలపు | Idea. |
| | మరచు | | మరపు | Forgetfulness. |
| | పొలుచు | | పొలుపు | Beauty |
| | మెచ్చు | | మెప్పు | Praise. |
| | వలచు | | వలపు | Love. |
| | వాచు | | వాపు | Swelling. |
| | అరచు | | అరపు | Crying. |
| ఇక | అలయు | | అలయిక | Exhaustion. |
| | ఓపు | | ఓపిక | Energy, Strength. |
| | కను (కాని) | | కానిక | Offering. |
| | కోరు | | కోరిక | Wish. |
| | కూడు | | కూడిక | Adding, Mixing. Meeting. |
| | పోలు | | పోలిక | Resemblance Comparison. |

| | | | |
|---|---|---|---|
| న | మన్నించు | మన్నన | Regard. |
| | దీవించు | దీవన | Blessing. |
| | గడించు | గడన | Earning. |
| | వీచు*(వీవు) | వీవన | Fan. |
| గడ | మను | మనుగడ | Living. |
| ఇకి | కోరు | కోరికి | Wish. |
| | విను | వినికి | Hearing. |
| | చూచు(చూడు) | చూడికి, చూడ్కి | Look. |
| వు | కొలుచు | కొలువు | Service. |
| | చచ్చు | చావు | Death. |
| | తడయు | తడవు | Delay. |
| అ | ఎండు | ఎండ | Sunshine. |
| | కాయు | కాయ | Nut. |
| అక | అమ్ము | అమ్మకము | Sale. |
| | వండు (వంటు) | వంటకము | Cooking, Cooked Preparation. |
| | పంచు | పంపకము | Sending, Division. |
| డు | అల్లు | అల్లుడు | Son-in-law. |
| | దంచు | దంపుడు | Pounding. |
| | దాచు | దాపుడు | Hoarding. Concealing. |
| | పెంచు | పెంపుడు | Rearing, Adoption. |

* The ending చ is changed to వ.

| | | | |
|---|---|---|---|
| ఉ | ఒప్పు | ఒప్పు | Beauty. |
| | పెట్టు | పెట్టు | Charity. |
| వడి | నడచు | నడవడి | Behaviour. |
| | కలుగు (opp) లే లేవడి | | Poverty. |
| అవు | నగు | నగవు | Laughter. |
| | తగు | తగవు | Justice. |
| ఇ | చేయు | చేయి | Hand. |
| | వ్రాయు | వ్రాయి (వ్రాలు Plural) | Letter. |

అతివ = Lady.

ఏరు = Stream.

కావడి = A bangy or yoke.

కించిత్తు = Little.

చలి = Cold.

తరుచు = Frequent.

తుమ్ము = Sneezing.

పిందె = A tender nut.

మడుగు = Clean soft cloth.

మాఘము = Name of a month (11th) in the శిశిరఋతువు.

శాపము (N.) = Curse.

పట్టి = Empty.

ROOT

తీరు = To cease.

కలిమిలేములు కావడికుండలు.

కూరిమిగల దినములలో నేరము లేమియును కలుగనేరవు.

గడనగల మగనిచూచిన అడుగడుగున మడుగు లిడుదురతివలు.

కించిత్తు నల్లి కుట్టిన మంచమునకు చేటువచ్చు.

పాటెరుగని రాజుకొలువు వలదుర సుమతీ.

పెట్టుపోతలు లేని వట్టికూతలు;

పూలు పిందెలులేని వట్టిచెట్టులు.

మాఘమాసపు చలి మంటలో పడినను తీరదు.

లంకమేతకు ఏటి ఈతకు సరి.

శాపాలకు చచ్చినవారు దీవనలకు బ్రతికినవారు లేరు.

సంపదలో మరపులు, ఆపదలో అరపులు.

తుమ్ముకు తమ్ముడులేడు కాని ఆవులింతకు అన్న ఉన్నాడు.

సెలవులలో ఆటలాడుచు పాటలు పాడుచు కాలము గడపితిని.

నగవు నాలుగువిధాల చేటు.

పనిచేయు కోరిక కలదు కాని ఓరిమియు ఓపికయు లేవు.

Death is better than poverty.

There is resemblance between the gait of ladies and that of swans.

Anger is a sign of bad behaviour.

Men become friends by frequent comings and goings.

Having heard the sounds of the cocks. I woke up before day-break.

Sita saw the beauty of the golden deer while it was grazing at a distance and showered praises on it.

There is no medicine for the bite of a man.

Rama shewed great regard towards the sages and requested them to give their blessings to him.

There is swelling on the feet of my grand-father on account of old age.

With great modesty the disciples gave presents to their preceptors.

The living of a man without earning creates aversion.

I could not begin writing on account of exhaustion:

The looks of Surpanakha displayed great love towards Rama.

How much money did you get by selling the (the sale of the) crop of this year.

People can easily know the ideas of the poets if they read their writings with patience.

# 28th Day

తద్ధిత ప్రత్యయములు

తద్ధిత Affixes; Secondary Affixes.

తద్ధితాంతములు are derivative Nouns formed by adding తద్ధిత affixes to either Nouns or adjectives. Case terminations are added to the తద్ధిత bases as in the case of the కృదంత bases. Some Secondary Affixes, the meanings in which they are added and the changes that the roots undergo when they are added are given below.

| | | | |
|---|---|---|---|
| తన | దొంగ | దొంగతనము | Theft. |
| భావార్థము: The | నల్ల | నల్లదనము | Blackness. |
| sense of an | మంచి | మంచితనము | goodness. |
| Abstract Noun. | | | |
| రిక | కన్నె | కన్నెరికము | girlhood. |
| (భావార్థము) | చుట్టము | చుట్టరికము | Relationship. |
| | పేద | పేదరికము | Poverty. |
| ఇమి | చెలి | చెలిమి | Friendship. |
| (భావార్థము) | పేరు | పేరిమి | Greatness. |
| | మేలు | మేలిమి | Goodness. |
| | వాడి | వాడిమి | Sharpness. |
| | వేడి | వేడిమి | Hotness. |
| న | నల్ల | నల్లన(నలుపు) | Blackness. |

| | | | |
|---|---|---|---|
| (భావార్థము) | తెల్ల | తెల్లన(తెలుపు) | Whiteness. |
| | పచ్చ | పచ్చన(పసుపు) | Greenness. Yallowishness. |
| | ఎఱ్ఱ | ఎఱ్ఱన(ఎరుపు) | Redness. |
| | కమ్మ | కమ్మన | Sweetness. Deliciousness. |
| | పుల్ల | పుల్లన, పులుపు | Sourness. |
| | తియ్య | తియ్యన(తీపు) | Sweetness. |
| | చక్క | చక్కన | Beauty. |
| ఉక | ఎమ్ము | ఎమ్ముక | Bone. |
| (స్వార్థము) (Own Sense) | నిప్పు | నిప్పుక | Spark of fire. |

| | | M | F | |
|---|---|---|---|---|
| కా(M.) క త్తియ(F.) | అందము | అందగాడు | అందగ త్తియ | Beautiful person |
| | చెలిమి | చెలిమికాడు | చెలిమిక త్తియ | Friend. |
| మతుబర్థము = | జూదము | జూదగాడు | జూదగ త్తియ | Gambler. |
| In the sense | బేరము | బేరగాడు | బేరగ త్తియ | Purchaser. |
| of possesion | విలు | విలుకాడు | విలుక త్తియ | Bowman. |
| | వేట | వేటకాడు | వేటక త్తియ | Hunter. |

| | | | |
|---|---|---|---|
| కా(M.) క త్తియ(F.) స్వార్థము | చెలి | చెలికాడు M. చెలిక త్తియ F. | Friend |
| అరి | జాలము | జాలరి | Netman. Fisherman. |
| (మతుబర్థము) | పూజ | పూజరి పూజారి | Worshipper |

| | | | |
|---|---|---|---|
| | చదువు | చదువరి | Educated person. |
| | జూదము | జూదరి | Gambler. |
| | టక్కు | టక్కరి | Deceive. |
| | తగవు | తగవరి | Mediator who settles a quarrel with justice. |
| | నేర్పు | నేర్పరి | Skillful person. |
| | సిగ్గు | సిగ్గరి | Bashful person. |
| ఇ | బేహారము | బేహారి | Merchant. |
| (మతుబర్థము) | కడలు | కడలి | Ocean. |
| | బండారము | బండారి | Treasurer. |
| | మచ్చరము | మచ్చరి | Jealous person. |
| త | చాకి | చాకిత | Washer woman. |
| In the sense of a female of a certain caste | బోయ | బోయత | A woman of the hill tribe. |
| | వ్రే | వ్రేత | Shepherd woman |
| | సాలె | సాలెత | Weaver woman. |
| Sometimes ఎ is | చెంచు | చెంచెత | A woman of the చెంచు Caste. |
| Substituted for the final vowel before త | మాల | మాలెత | Harijan woman. |
| ఆడి(F.) | వగ(లు) | వగలాడి | Handsome woman. |
| This is added to plural forms in మతుబర్థ | వన్నె(లు) | వన్నెలాడి | Coquette. |
| ఆ(M.) | వగ | వగలాడు | Handsome man. |
| | వన్నె | వన్నెలాడు | do |

| | | | |
|---|---|---|---|
| ఇడి | ముక్కు | ముక్కిడి | A man without nose. |
| అభావార్థకము | వాలము | వాలిడి | ,, without tail. |
| It indicates absence | వెరవు | వెరవిడి | ,, without skill· |
| ఎడు | వీసె | వీసెడు | one vis. |
| It is added to | గంప | గంపెడు | Basketful. |
| Singular Nouns in the sense of Measure = మానార్థ | జేన | జేనెడు | Span long. |
| In some cases | దోసిలి | దోసెడు | Double handful. |
| the final లి is dropped | పిడికిలి | పిడికెడు | fistful. |
| బంటి | రొమ్ము | రొమ్ముబంటి | Upto the chest. |
| దఘ్నార్థము | కుత్తుక | కుత్తుకబంటి | Upto the neck. |
| In the sense of up to | మోకాలు | మోకాలిబంటి | Upto the Knee. |
| కొలది | మోకాలు | మోకాలికొలది. | |
| పోతు | | | |
| తాచ్ఛీల్యార్థము | తిండి | తిండిపోతు | Glutton. |
| Indicates nature | | | |
| ఆము | పెండ్లి | పెండ్లము | Wife. |
| (మతుబర్థము) | | | |
| మయ | తన | తనమయము | |
| ప్రాచుర్యార్థము = Profusion or Exeess (full of) | తమః | తమోమయము | Full of darkness. |
| Generally it is used to Sanskrit words alone. | | | |

కొందరు పేదరికమును ఆరవ మహాపాతకముగా భావించిరి.

మంచిదన మున్నచో నల్లతనము వలన నష్టమేమి?

పొరుగింటిలో నిన్న దొంగతనము జరిగినది.

ధర్మరాజునకును కర్ణునకును గల చుట్టరికము నీకు తెలియునా?

వేసవిలో సూర్యుని వేడిమి నిప్పుకలు చిమ్ముచుండును.

చెలిమియు కలిమియు కల జనుల మనుగడ సుఖమయముగా ఉండును.

శకుని గొప్ప జూదగాడు; అర్జునుడు మేటి విలుకాడు; సహదేవుడు చాల అందగాడు.

అర్జునుని పరీక్షించుటకు శివుడు వేటకాని వేషమును. పార్వతి చెంచెత వేషమును ధరించి అడవికి వెళ్ళిరి.

సాలెత బట్టలు నేయును; చాత బట్టలు ఉతుకును.

శివుని మేను తెలుపు; కృష్ణుని మేను నలుపు; గులాబి రంగు ఎరుపు; సంపెగ పూవు రంగు పసుపు.

ద్రౌపది పంచపాండవుల పెండ్లము. దుర్యోధనుడు మచ్చరి అయి ఆమెను నిండుసభలో అవమానించెను.

పూజారి దేవుని పూజకై గంపెడు పూవులు తెచ్చినాడు.

There is no goodness in enmity.

At one time Arjuna could not bear the sharpness of the arrows of Karna.

The deceitful Sakuni was very skilful in gambling.

Surpanakha went to Rama in the form of a handsome lady and experessed her love towards him.

Lakshmana gave her a fitting punishment by making her noseless.

The fisherman went into the sea neck–deep, caught fish with his net and sold a basketful of them.

Gandhiji used to wear a small Khaddar Dhoti coming up to Knee.

The shepherd woman considered Krishna not merely as a beautiful person but also as god.

Anasuya and Priyamvada were the two female friends of Sakuntala.

You can know the sweetness and the greatness of the Telugu language if you read Potana's verses.

When Krishna saw Kuchela, friend of his childhood, he asked him what offering he brought for him.

In Sanskrit dramas Vidushakas are described as gluttons aud heroines as bashful maidens.



# 29th Day

## కారకము (Syntax)

1. The relation between a Noun and a Verb in a sentence is called Karaka. There are six Karakas belonging to the seven cases except the genitive which is not a Karaka case.

2. Below are given the terminations of the seven cases and the circumstances and the meaning in which they are used in sentences.

3. The Nominative case (డు, ము, వు, లు) indicates ప్రాతిపదికార్థ (Meaning of the erude form of a word; రామ= రాముడు) Nominative of address (రాముడ) and ఉక్తార్థ (Meaning expressed by the verbal termination (ఆఖ్యాత). రాముడు రావణుని చంపెను. Here the ఆఖ్యాత (ఎను in చంపెను) is telling about the Agent కర్త and that is why it is put in the Nominative case రాముడు). It also indicates the number (రాముడు (Sing.) రాములు (Pl.) In Passive construction it denotes the object as then the ఆఖ్యాత tells about the object (రామునిచే రావణుడు చంపబడెను).

4. The Accusative case (ని, ను, ల) denotes the object (c) the person or thing upon whom or which the effect of an action takes place. దేవదత్తుడు వంటకమును వండెను.

5. Among the terminations of the Instrumental case.

(a) చే, or చేత denotes i the Agent or the Subject. In the passive construction.
రామునిచే రావణుడు చంపబడెను.

ii and the instrument or the means by which an action is done.

రాముడు వాలిని బాణముచే చంపెను Instrument. ధనముచే సౌఖ్యము కలుగును. (Means) తో or తోడ can also be used for చే or చేత in the first case and వలన in the second case రాముడు బాణముతో వాలిని చంపెను. ధనమువలన సౌఖ్యము కలుగును.

iii It is optionally used in the sense of వలన of the Ablative case in connection with verbs meaning to take, to know to hear etc.

ఈ వార్త మిత్రునిచే (వలన) ఎరింగితిని. రైతు ధనికునిచే (వలన) ఋణము కొనియెను (గ్రహించెను).

(b) తో or తోడ is used with words denoting the Instrument and expressing the sense of equality (తుల్యార్థ) or accompaniment (సహార్థ),

రాముడు వాలిని బాణముతో (చే) చంపెను (Inst.)
విలువిద్యయందు కర్ణుడు అర్జునునితో సమానుడు (equality).

Here the కు of the genitive also can be used. అర్జునునకు సమానుడు. రాజు సేనతో వచ్చెను (accompaniment).

ii తో or తోడ is used with the Indirect objict of the verbs having the meaning of చెప్పు (to tell).

అమ్మ ఆ వార్త నాన్నతో చెప్పెను (నాన్న Indirect object).
Here కు also may be used నాన్నకు చెప్పెను.

iii తో or తోడ is used with words denoting persons from whom something is studied regularly (with నియమ)
రామకృష్ణులు సాందీపనితో వేదములు అభ్యసించిరి.

Here సాందీపనితో means సాందీపనివలన. Nowadays సాందీపని యొద్ద or సాందీపని వద్ద is frequently used.

6. The Dative termination కొరకు is used with the Indirct object of the root ఇచ్చు (to give) సంప్రదాన.

జనకుడు రామునికొరకు సీతను ఇచ్చెను.

The dative terminations కొరకు and కై denote the sense of for or the for the sake of.

హనుమంతుడు సీతను వెదకుట కొరకు (వెదకుటకై) లంకకు అరిగెను.

In modern times కు is used instead of కొరకు or కై

రామునకు సీతను ఇచ్చెను.

వెదకుటకు లంకకు అరిగెను.

7. The Ablative termination వలన is used with words meaning
(i) a person or thing from whom separation (అపాయ); ii. fear (భయ), iii. dislike (జుగుప్స); iv. exhaustion (పరాజయ); v. indifference (ప్రమాదము); vi. reception (గ్రహణ); vii. birth (భవన); viii. protection (త్రాణ); ix. cessation (విరామ); x. hiding (అంతర్ధి); or xi. prevention (వారణ) is caused.

i. రాముడు రాజ్యము వలన తొలగెను.

ii, నేను దొంగవలన (దొంగకు) భయపడితిని.

iii. ధర్మరాజు పాపమువలన (పాపమునకు) ఏవగించెను.

iv. నేను చదువువలన (చదువునకు) డస్సితిని.

v. రావణుడు ధర్మమువలన (ధర్మమునకు) పరాకుపడెను.

vi. రాజు ప్రజల వలన పన్నులు గ్రహించెను.

vii. మనువు వలన మానవులు పుట్టిరి.

viii. విదురుడు పాండవులను ఆపద వలన రక్షించెను.

ix. జనకుడు భోగమువలన విరమించెను.

x. కృష్ణుడు యశోద వలన దాగెను.

xi. కృష్ణుడు అర్జునుని దుఃఖము వలన వారించెను.

In certain cases కు is substituted for వలన.
Sometimes ఉండి is added to వలన.

నారదుడు స్వర్గమువలన నుండి వచ్చెను.

హిమవంతమువలన నుండి గంగ ప్రవహించును.

Before ఉండి the terminations of the Accusative (ని, ను) or the Locative (అన్, అందు) are substituted for వలన.

స్వర్గమువలన నుండి – స్వర్గము నుండి
స్వర్గమందుండి

వాడూరి వలన నుండి వచ్చెను – వాడూరి నుండి వచ్చెను
వాడూర నుండి వచ్చెను.

The Ablative termination కంటె is used in cannection with the words అన్యము, ఇతరము, పూర్వము. పరము etc.

హింసకంటె అన్యము పాపము లేదు.

రామునికంటె ఇతరుడు దేవుడు లేడు.

లక్ష్మణుడు శత్రుఘ్నునికంటె పూర్వము జనించెను.

ఉపకారముకంటె అచ్చుపరమగునపుడు సంధి అగును.

Sometimes కు is used in the place of కంటె. శత్రుఘ్నునకు పూర్వము; ఉకారమున కచ్చుపరమగునపుడు. కంటె is used to denote comparison.

When one is distinguished from another in respect of class quality or action కంటె is used with the word from which the distinction is made.

అటవికుల కంటె నాగరులు జ్ఞానవంతులు.
పేదరికము కంటె చావుమేలు.

పట్టి is used with qualities or actions (in the Accusative case) expressing cause.

రాముడు ధర్మమును బట్టి పూజ్యుడయ్యెను.
మిత్రుడు వచ్చుటనుబట్టి సంతోషము కలిగినది.

9. The genitive termination యొక్క denotes సంబంధ (relation) of one noun to another.
This is optionally dropped.

రాముని (యొక్క) తండ్రి
వాని (యొక్క) మిత్రుడు.

The genitive termination లోపల or లో denotes నిర్ధారణ (distinguishing a thing or person from a group) and is used with the word denoting the group from which the distintion is made.

వానరులలో (లోపల) హనుమంతుడు మతిమంతుడు.
మనుష్యులలో క్షత్రియుడు శూరుడు.

10 The Locative case (అందు) denotes అధికరణ (ఆధార or the place where an action takes place with reference to the subject or the object),

కుండయందు నీరున్నది.
ధర్మమందు కోరిక కలదు.
అన్నింటియందు దేవు డున్నాడు.

న is used in the sense of అందు and చేత with words that are lifeless and that end is ఉ.

నాకు ధర్మమున కోరిక కలదు (ధర్మమునందు).
ఘటమున నీరున్నది (ఘటమునందు).
రాముడు బాణమున వాలిని చంపెను (బాణముచేత).

11. Words denoting time and distance are generally used in the Nominative case
మిత్రుడు రేపు వచ్చును, నేను నేడు చదువజాలను, దొంగ మైలు పరుగెత్తెను.

భీముడు తల్లికోరిన విధమున అన్నపుబండితో వెళ్ళి బకాసురుని సంహరించెను.
కంసుడు మేనల్లుడైన కృష్ణునిచే సంహరింపబడెను.
భీముడు గదచే (తో) దుర్యోధనుని తొడలు విరుగగొట్టెను.
తృప్తిచే (వలన) అధికసౌఖ్యము కలుగునని పెద్దలు చెప్పుదురు.
సీత క్షేమముగా ఉన్నవార్త హనుమంతునిచే (వలన) విని రాముడు మిక్కిలి సంతోషించెను.
రాముడు వానరసేనతో సముద్రముదాటి రావణునిపై దండెత్తెను.
కర్ణుడు శౌర్యమున అర్జునునితో సమానుడైనను, బ్రాహ్మణుడును గురువును ఇచ్చిన శాపములవలన యుద్ధమున మరణించెను.
నేను నేడు బడికి రాలేదని మా అమ్మకు చెప్పకుము.
పాండవులు ద్రోణునితో విలువిద్యను అభ్యసించిరి.
ద్రుపదుడు తన కూతురైన ద్రౌపదిని పంచపాండవులకు భార్యగా ఇచ్చెను.
కౌరవులు బలవంతులే అయినను ధర్మమువలన పరాకు పడుటచే ఓటమి పొంది నశించిరి.
దనువువలన పుట్టిన రాక్షసులకు దానవులని పేరు.

Good kings do not think of taking additional taxes from the people

Krishna protected Droupadi from insult by giving her as many saris as required.

Now-a-days many people try to go to towns from the villages.

Sages desist from worldly pleasures.

Hanuman told Sita that there were many other monkeys equal to him and greater than him in valour.

Truthfulness is said to be nobler than all other good qualities.

A washerman is some times better than an educated man.

Nature appears to be beautiful on account of the coming of the spring.

Saraswathi is the wife of Brahma who is born of the lotus in the navel of Vishnu.

Kalidasa is great among the Sanskrit poets.

The cat is drinking the milk that is in the cup.

Prahlada told his father that God is in each and every place.

My father went to Delhi day before yesterday and will return day after to-morrow.

–X–

# 30th Day

## వాక్యములు ; SENTENCES

1. A sentence contains a word or group of words. When there are many words they should be mutually related and uttered one after another without much interval.

2. A sentence is made up of two parts – the subject and the predicate. The Predicate includes the verb and the object when the verb happens to be transitive.

   రాముడు వచ్చెను.

   రాముడు రాక్షసులను సంహరించెను.

3. In some sentences the predicate contains a noun or an adjective.

   రాముడు దశరథుని కుమారుడు.

   మన్మథుడు సుందరుడు.

   In such cases it may be considered the verb derived from the root అగు and having the gender and number of the subject is omitted.

   రామలక్ష్మణులు దశరథుని కుమారులు (అగుదురు).
   సీత రాముని భార్య (అగును).
   సీత గుణవంతురాలు (అగును).
   మామిడిపండ్లు మధురములు (అగును).

   Sometimes an interrogative pronoun forms the predicate.

రాముడు ఎవరు ?

సీత ఎవ్వరు ? (ఎవతె).

పుస్తకము ఏది ?

బండి ఎట్టిది ?

4. Generally the subject is either a noun or a pronoun. In some sentences the infinitive happens to be the subject of the verb. In such cases the infinitive gives the meaning of a భావార్థక or a verbal noun.

అసత్యము ఆడకూడదు (ఆడుట).

ఇతరులకు సాయము చేయవలయును (చేయుట).

పెద్దలను నిందింప తగదు (నిందించుట).

రేపు చదువ వచ్చును (చదువుట).

Here వచ్చును means కూడును or తగును.

5. In some sentences the verb forms of the root ఉండు are omitted.

రాముడు ఎక్కడ ? (ఉన్నాడు).

సీత ఎక్కడ ? (ఉన్నది).

పుస్తకము ఎక్కడ ? (ఉన్నది).

బాలురు ఎక్కడ ? (ఉన్నారు).

అక్కడ ఎవరు ఉన్నారు ? రాముడు. (ఉన్నాడు).

6. Sometimes the subject is understood, and is to be guessed from the context.

ఇట్లు వెళ్ళినచో నవ్వుదురు (చూచువారు; జనులు).

నలుగురిలో నవ్వరాదని చెప్పుదురు (పెద్దలు).

పొండు (మీరు).

7. We find articles 'a' and 'the' in English. In Telugu there are no articles.

ఒకానొక or ఒక is used in the place of 'a'.

పూర్వము ఒక గ్రామమున ఒక (ఒకానొక) బ్రాహ్మణుఁడు ఉండెను. ఒకానొక means a certain.

8. The Singular or the Plural may be used to denote a class.

జీవులలో మానవుడు శ్రేష్ఠుడు.

పండితుడు పూజ్యుడు.

9. The plural is frequently used as a mark of respect. Some times వారు is added to the plural form ending in 'లు' which is changed to 'e'.

స్వాములు (స్వాములవారు); (స్వామివారు) గ్రామమునకు దయచేసినారు.

ఆచార్యులవారు ఎక్కడ ఉన్నారు ?

Asceties (సన్యాసులు) kings and great persons use the plural number while talking of themselves.

మేము రేపు కొలువునకు వత్తుము.

మా వాక్యములు వేద సమ్మతములు.

గారు, or వారు is added to certain words as a mark of respect.

గురువు గారు, పంతులు గారు, అయ్యగారు.

అయ్యవారు, అమ్మగారు, అమ్మవారు.

10. Words meaning సస్య, సంభార, లోహ, గుణ, రస etc. are always used in singular.

వరి పంట; కంది పంట మొ॥

ఆముదము; ఇంగువ; ఉప్పు; చమురు.

ఇత్తడి; ఇనుము; బంగారు; వెండి.
తెలుపు; నలుపు.
తీపు; పులుపు.

12. Words meaning ధాన్య, క్రీడావిశేష etc. are always used in the plural number.

చోళ్లు; వడ్లు; కందులు; పెసలు; మినుములు. బియ్యము; జీలకర్ర; come under సంభార and therefore are used in singular.

గుజ్జనగూళ్లు; బొమ్మల పెండ్లిండ్లు.
దాగిలి మూతలు; ఓమన గుంటలు.

13. Sentences are of two kinds: Complete (సంపూర్ణ) and incomplete (అసంపూర్ణ).

A sentence containing a finite verb is a complete sentence.

వాన కురియుచున్నది.
సాయంకాలము సూర్యుడు అస్తమించును.
రాముడు భార్యతోడను, తమ్మునితోడను అడవి కేగెను.

A sentence containing క్త్వార్థక, వ్యతిరేక క్త్వార్థక, చేదర్థక is an incomplete sentence.

బాలుడు అన్నము తిని నిద్రించెను.

The boy took food and slept. In English this is a compound sentence as it contains two separate main clauses which are connected by and.

In Telugu, the verb in the first part which denotes the action first takes place is put in క్త్వార్థక. This is an incomplete sentence which is sometimes expressed in English by a phrase also.

The boy slept after taking food.

రాముడు అడవికి వెళ్లి రాక్షసుల సంహారించెను.

Having gone to the forest, Rama killed the Rakshasas.

The boy has not taken food and is going to the school.

బాలుడు అన్నము తినకుండ బడికి పోవుచున్నాడు.

In English, this is generally expressed by a phrase.

The boy is going to school without taking food.

నీవు పెండ్లికి వచ్చిన నేను మిక్కిలి సంతోషింతును.

I shall feel very glad if you attend the marriage. (Adverbial clause of condition). Examples for other adverbial clauses and adjectival clauses are already given in the chapter on Sandhi. Generally the subject of the క్త్వార్థక or వ్యతిరేక క్త్వార్థక and the finite verb, in the same sentence is the same.

14. Compound sentences are rare in Telugu. When two sentences are connected by కావున, కాని, లేనిచో etc. they can be considered as compound sentences.

నేడు వాన కురిసినది కాని భూమి తడువలేదు.

రేపు మా అన్న ఊరినుండి వచ్చును; అందుచే (కావున) నేను బడికి రాను.

నేను వ్రాసిన ఉత్తరము మా తమ్మునికి అంది యుండదు; లేనిచో అతడు తప్పక వచ్చియుండును.

15. A group of sentences is called a మహావాక్య or a Paragraph.

16. In Telugu there is no fixed order in whieh words ere to be used in a sentence. But generally the Subject and the Verb are placed one after another in a sentence. In Poetry this order changes according to the convenience of the Ganas.

Adjectives are generally placed before the Nouns or Pronouns which they qualify. Adverbs are pleaced before the verbs. There are certain words like ఐన, ఏని, ఏసి which have a fixed place in a sentence. They have to be used there alone.

Either father or mother should accompany our younger sister నాన్న ఐన (కాని) అమ్మ ఐన (కాని) చెల్లెలితో వెళ్ళవలయును.

I wish to read either Ramayana or the Mahabharata.
నేను రామాయణమునేని భారతమునేని చదువగోరుచున్నాను.

పెండ్లికి నీవైన రాలేదు.
Even you did not attend the marriage.

నీవు రానిచో నేనైన వెళ్ళెదను.

At least I shall go if you do not come.

నేను ఒక్క ప్రశ్నయైన వ్రాయలేకపోతిని.
I could not answer even one question.

అక్కయు చెల్లెలును నాలుగేసి పండ్లు తినిరి.
The elder sister and the younger sister ate each four fruits.

న్యాయమూర్తి వారిరువురికిని రెండేసి రూపాయలు జరిమానా విధించెను.

The judge fined both of them each two Rupees.

Other words can be used in a sentence according to the convenience and the liking of the writer.

గాలి చల్లగా వీచెను; వీచెను గాలి చల్లగా.
చల్లగా గాలి వీచెను; వీచెను చల్లగా గాలి.
గాలివీచెను చల్లగా; చల్లగావీచెను గాలి.

17. The Verb must agree with its subject in Number, Gender and Person.

బాలురు నిద్రించిరి. కన్య వచ్చినది.
పూవులు వాడినవి. పండు కుళ్ళినది.
పెద్దలు వచ్చుచున్నారు, ఈ ఏడు వానలు బాగుగా కురిసినవి.

18. When the Subject contains two or more words the Verb will generally, be in the Plural Number.

రాముడును లక్ష్మణుడును సీతకై వెదకిరి.
బాలుడును బాలికయు బడినుండి వచ్చుచున్నారు.
రాముడు అడవికి వెళ్ళుచుండ రాజును ప్రజలును విలపించిరి.

Sometimes the Verb agrees with the nearest Subject in Number and Gender.

తమ సేనలును వారును విశ్రమించిరి.

బంధువులును ధనములును మరణించినవారివెంట రావు.
ధనములును బంధువులును మరణించినవారివెంట రారు.
చెన్నుడును బుద్ధుడెక్కిన గుర్రమును పట్టణమునకు తిరిగి వచ్చెను.

When the words in the subject are connected by ఏని or కాని, the Verb will agree with the one nearest to it.

ఎడారులలో మృగములు కాని మనుష్యులు కాని కనపడరు.

ఎడారులలో మనుష్యులేని మృగములేని కనపడవు.

When the subject contains two words in the singular number connected by కాని, the verb will be either in the singular or in the plural number.

రాముడు కాని లక్ష్మణుడు కాని వత్తురు - వచ్చును.

When a verb agrees with two or more subjects of different persons connected by the conjuction ఉను, the first person has preference over the second or the third and the second over the third.

నేనును నీవును వెళ్లితిమి.

వాడును నీవును వచ్చితిరి.

మేమును మీరును చూచుచున్నాము.

వారును మేమును వెళ్లుదుము.

వారును మేమును ధన్యులము.

వాడును నీవును నేనును చదువుచున్నాము.

An adjective agrees with the substantive it qualifies in number, gender and case.

గుణవంతుడు బాలుడు.

గుణవంతురాలు భార్య.

రసవంతము గ్రంథము.

క్రూరులు రాక్షసులు.

అందకత్తెలు స్త్రీలు.

అనిత్యములు భోగములు.

The following are the exceptions.

(a) Of the pronouns or numerical adjectives and the substantives qualified by them members first used will be optionally in the nominative case. though the second member is in any one of the oblique cases.

అన్నింటికి గుర్రములకు;

అన్నిగుర్రములకు;

గుర్రములకు అన్నింటికి.

రెండు గుర్రములకు;

గుర్రములు రెండింటికి.

(b) Sometimes the adjectives will optionally be in the nominative case, though the substantives are in the genitive.

గుణవంతునకు రామునకు నమస్కారము.

గుణవంతుడు రామునకు నమస్కారము.

(c) The adjectives will be in the nominative case, when they are followed by అయిన, అగు etc. though the substantives are in different cases.

గుణవంతుడగు పురుషుని జనులు పూజింతురు.

క్రూరులయిన రాక్షసులవలన మునులకు పెక్కు బాధలు కలుగుచుండెను.

బలవంతుడగు భీమునిచే బకుడు సంహరింపబడెను.

గ్రంథాలయములో రసవంతమయిన పుస్తకముకొఱకు వెదకుచున్నాను.

When there are two or more adjectives అగు or అయిన is used after the last adjective and అయి after all the other adjectives.

చిన్నదై సులభమై రసవంతమయిన ఒక పద్యమును చదువుము.

When అయి is not used, the conjunction ఉను is optionally added either to the last adjective or to all adjectives.

గుణవంతుడును దరిద్రుడును అగు బాలునికి జనులు సాయము చేయుదురు.

గుణవంతుడు దరిద్రుడు అగు బాలునికి జనులు సాయము చేయుదురు.

గుణవంతుడు దరిద్రుడుఅగు బాలునికి జనులు సాయము చేయుదురు.

19. The adjectives qualifying pronouns in the first and second persons ను and వు in the singular and ము and రు in the plural are added respectively to them, and when they are added the final ఉ of the adjectives is changed to అ.

వాడు గుణవంతుడు - వారు గుణవంతులు.

నీవు గుణవంతుడవు – మీరు గుణవంతులరు.

నేను గుణవంతుడను - మేము గుణవంతులము.

There are exceptions to this rule.

మీరు పెద్దలు – గుణవంతుడగు నిన్ను

After adjectives ending in ఇ-వు and ను are changed to వి and ని respectively.

వాడు గుణశాలి.

నీవు గుణశాలివి.

నేను గుణశాలిని.

20. When the adjective qualifies two or more snbstantives it agrees with them in their combined number.

సీతయు రాముడును గుణవంతులు.

పులియు సింహమును క్రూరములు.

When the substantives differ in gender the adjectives will be masculive, if the substantives are masculine and feminine and neuter if they are masculine, feminine and neuter.

నలుడును దమయంతియు గుణవంతులు.

విద్యలేనిచో మానవులును పశువులును సమానములు.

సమానులు (Masculine) is also used.

21. Adjectives that are స్త్రీసమములు (that do not have డు, ము or వు in the end) and that end in ము are optionally placed in the singular number though their substantives are in the plural number.

మాటలు పెక్కుఏల – మాటలు పెక్కులేల.

ఇష్టమగు వస్తువులు – ఇష్టములగు వస్తువులు.

——

# RELATIVE PRONOUNS

In English a relative pronoun does the work of a pronoun and that of a conjunction.

This is the book **which** I brought yesterday.

In Telugu, the relative pronouns are generally omitted and the adjectival clauses beginning with them are translated by a mere phrase.

దేనిని నిన్న నేను కొంటినో ఆ పుస్తక మిదే.

This is not idiomatic in Telugu.

నిన్న నేను కొన్న పుస్తక మిదే is idiomatic and natural.

Below are given some relative pronouns and the corresponding demonstrative pronouns.

ఎవడు – వాడు or అతడు.

ఎవరు – వారు.

ఎవరు is the plural form of ఎవడు. It is generally used in the singular sense also.

ఎవతె – ఆమె

ఏది – అది

ఏ, ఆ ; ఎక్కడ – అక్కడ.

ఎచ్చట – అచ్చట.

ఎన్ని – అన్ని.

ఎందరు – అందరు.

ఎప్పుడు – అప్పుడు.

ఎంత – అంత.

ఎట్లు – అట్లు.

A relative pronoun is so called because it refers or relates (carries us back) to some noun going before it which is called the antecedent.

ఎవరు తృప్తితో జీవింతురో వారు (ఆ నరులు) ధన్యులు.

The relative prouonn ఎవరు is used for ఆ నరులు which is the antecedent. The antecedent is used either in the first half or latter half. When it is used in the first half it is preceded by ఏ and when it is used in the latter half by ఆ. When the relative pronouns used in the first half the corresponding personal pronoun or the antecedent preceded by ఆ, is used in the latter half.

ఏ నరులు (ఎవరు) తృప్తితో జీవింతురో వారు (ఆ నరులు) ధన్యులు.

The relative pronoun agrees with its antecedent in genender number and person, the case of the relative and antecedent being determined by their relation to other words in the sentence.

ఎవరు గుణవంతులో వారిని అందరును గౌరవింతురు.

ఎవరు = ఏ నరులు.

ఎవతెతో నీవు నిన్న మాటలాడితివో ఆమె చాల గుణవంతురాలు.

ఎవతెతో = ఏ స్త్రీతో.

దేనిని వినిన పాపము పోవునో ఆ కథ చెప్పుము.

ఏ నరులు స్వార్థము విడిచి లోకముకొఱకు జీవింతురో వారే మహాత్ములు.

ఎవనికి ధనము కలదో ఆ నరుని అందరు పూజింతురు.

ఎవతె అందక త్తెయో ఆమె గుణవంతురాలు అని చెప్పజాలము.

ఏ వార్త నీవు వింటివో అది అబద్ధము.

ఏ గ్రంథమును చదివిన జ్ఞానము వృద్ధి పొందునో అది ఉత్తమ గ్రంథము.

ఎక్కడనుండి వచ్చితివో అక్కడికి వేగమే పొమ్ము.

ఎప్పుడు ధర్మము నశించునో అప్పుడు దేవుడు భూమిపై అవతరించును.

ఎచ్చట పొగ ఉండునో అచ్చట నిప్పుకూడ ఉండును.

నేను ఎన్ని పుస్తకములు తెచ్చితినో అన్నిటిని నీవు చదువవలెను.

గంగ ఎందరు పుత్రులను కనెనో అందరిని నీటిలో విడిచివైచెను.

ఆ పెండ్లినిగూర్చి నీవెట్లు చెప్పితివో అట్లే జరిగినది.

ఎంత తృప్తి ఉన్న అంత సుఖము.

ఎవరు ఆడినమాట తప్పరో వారు సత్యవంతులు.

నీ కెవరియందు నమ్మకము కలదో వారిని పిలువుము.

Sometimes ఏమి is used for ఏది.

నీవు సంతనుండి ఏమి తెచ్చితివో అది నాకిమ్ము.

In some sentences the corresponding pronoun is understood.

నీవు సెలవులలో ఏమి చదివితివో (అది) చెప్పుము.

☆

# DIRECT AND INDIRECT SPEECH

ప్రత్యక్ష పరోక్ష వచనములు

When actual words of the speaker are given it is called the Direct speech.

When a report is given by sombody other than the speaker, about what the speaker had said, it is called the indirect speech.

అని is added after the direct speech.

"అమ్మ! నాయనగారు ఎందుకు దుఃఖించుచున్నారు" అని రాముడు కైకను అడిగెను.

"నాయనా! రాజుగారు పూర్వము నాకు రెండు వరములు ఇచ్చిరి. ఆ వరములు ఇప్పుడు అడిగితిని" అని కైక బదులుచెప్పెను.

"అమ్మా! ఆ వరములు ఏమో చెప్పుము" అని రాముడు కైకను ప్రార్థించెను.

"నాయనా! ఆ వరములు చెప్పెదను వినుము. ఒక వరమువలన నీవు అడవికి వెళ్లవలయును, రెండవదానివలన నా కుమారుడు భరతుడు రాజు కావలెను" అని కైక తెలిపెను.

రాముడు "అమ్మా! ఇంతమాత్రమునకై రాజు దుఃఖించుట యెందుకు ? నేను ఇప్పుడే అడవికి వెళ్లెదను. భరతుని రాజుగా చేయుడు" అని పల్కి వెళ్లిపోయెను.

In Telugu the reporting verb is placed after the direct speech, immediately after అని.

When it is placed before the direct speech ఇట్లు or words meaning the same are added in the reporting speech, before the reporting verb. Generally this is seen when the Direct speech is long.

రాముడు కైకను ఇట్లు అడిగెను. "అమ్మా! నాయనగారు ఎందుకు దుఃఖించుచున్నారు...
కైక ఈ విధముగా బదులు పల్కెను "నాయనా! రాజుగారు పూర్వము రెండు వరము లిచ్చిరి. నేను ఆ వరములు ఇప్పుడు అడిగితిని...

Rules for changing the Direct speech into the indirect.

a) When the reporting verb is in the third person and in the past tense, the present tense in the Direct speech is changed to the Corresponding past tense. The past and the future tenses in the Direct speech remain unchanged.

(b) Pronouns of the first person are changed to the corresponding forms of తాను and the pronouns of the second person are changed to the third person.

(c) Words expressing nearness in time and place are generally changed into words expreesing distance.

(d) In requests and commands the imperative mood is generally retained as it is and the first person is changed to తాను.

"నేను జ్వరముతో బాధపడుచున్నాను". అని అతడు చెప్పెను.
తాను జ్వరముతో బాధపడుచుంటినని (చుండెనని) అతడు చెప్పెను.
"నేను రేపు కాశికి వెళ్ళెదను" అని మా నాన్న మిత్రునితో చెప్పెను.
తాను మరునాడు కాశికి వెళ్ళెదనని మా నాన్న మిత్రునితో చెప్పెను.
వైద్యుడు రోగిని "రాత్రి సుఖముగా నిద్రించితివా"అని అడిగెను.
రోగి "రాత్రి హాయిగా నిద్రించితిని" అని బదులు పలికెను.

వైద్యుడు రోగిని అతడు రాత్రి సుఖముగా నిద్రించెనా అని అడిగెను.

రోగి తాను సుఖముగా నిద్రించితిని అని బదులు పలికెను.

The following words in the Direct speech are changed into words noted agianst them, in the indirect speech.

ఈ - ఆ

ఇప్పుడు - అప్పుడు

ఇది - అది

ఇక్కడ - అక్కడ

ఇట్లు - అట్లు

నేడు - ఆరోజున

రేపు - మరుసటిదినమున

నిన్న - వెనుకటిదినమున.

"ఈ ఉదయము నీతో కలిసి ఉండుటకు సంతోషించుచున్నాను" అని మా మిత్రుడు చెప్పెను.

మా మిత్రుడు ఆ ఉదయము నాతో కలిసి ఉండుటకు తాను సంతోషించుచుండెనని చెప్పెను.

'ఇక్కడ ఇట్లు ఎందుకు బాధపడుచున్నావు' అని బుద్ధుడు పేదరాలిని అడిగెను.

బుద్ధుడు పేదరాలిని ఆమె అక్కడ అట్లెందుకు బాధపడుచుండెనని అడిగెను.

'నేను నేడు బయలుదేరుచున్నాను, వర్షముచే నిన్న బయలుదేర లేదు. రేపు అచ్చటికి రాగలను' అని తమ్ముడు ఉత్తరము వ్రాసెను.

తమ్ముడు తా నానాడు బయలుదేరుచుండెననియు వెనుకటిదినమున బయలుదేర లేకపోయె ననియు మరునాడిచ్చటికి రాగలననియు ఉత్తరము వ్రాసెను.

'నన్ను విడిచిపెట్టుము' అని హంస నలుని ప్రార్థించెను.

హంస నలుని తన్ను విడిచిపెట్టుమని ప్రార్థించెను.

EXERCISES

1. దేవః రాజ్యసుఖము లర్థింపలేదు.
స్వర్గమును గోరలేదు. మోక్షమును గోర
దుఃఖతప్తులై యున్న నా తోడిజనుల
ఆర్తి పాపంగ వేడెద అనుదినంబు.

3. మోచి తొమ్మిది మాసముల్ కాచి కాంచి
వలయునది యెల్ల సమకూర్చి యెలమి నించి
పెంచి పెద్దచేసిన తొలివేల్పు తల్లి
పాదములకు ఒనర్చెద వందనములు.

3. కాలు సేతులచే కాయు కర్మములను
కనులచేత చెవులచేత మనసుచేత
జరుగు మంచియో చెడ్డయో సర్వము క్షమి
యింపు దయతోడ ఓ దేవ ఈశ! వరద!

---

When there are more than two sentences in the direct speech అనియు is to be added after each sentence in the Indirect speech.

4. నీవె చుట్టంబు దీనుల కీవె దొరవు
దీనులందున ప్రముఖుండ దేవదేవ!
ఇరుతెరంగుల రక్షింప నీవె తగుదు
వెల్ల మా తప్పులను క్షమియింపుమయ్య.

5. ధనము వేడు వారల కిచ్చి తండ్రి చెడియె
ననుచు పుత్రు లిచ్చుట మానుకొనరు నిజము.
అనటి ఫల మిచ్చియె నాశ మందె ననుచు
దాని కూనలు ఫలమీయ మానుకొనునె!

6. మేలు మంచివారికి చేయ మేలె కలుగు
చెడ్డవారి కొనర్చిన చేటె వచ్చు;
పశువునకు మేతపెట్టిన పాల నిచ్చు
పామునకు పాలుపోసిన పట్టి కరచు.

7. ఒక్కతల్లి గర్భంబున పెక్కుమంది
కలుగ గుణములు వేరయి వెలయుచుండు
ఒక్క చెరువున తామర లుత్పలములు
నాచు కలుగ గుణములు భిన్నములు కావె.

8. తొడవు మనుజునకు రూపము
తొడవగు రూపమున కెన్న దొడ్డగుణంబుల్
తొడవు గుణములకు జ్ఞానము
తొడవగు జ్ఞానమున కోర్పుతో నునికి ఇలన్.

—శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి

9. బుద్ధుని మొదటిపేరు గౌతముడు. అతడు శాక్యవంశమునకు
చెందిన శుద్ధోదనుడను రాజు కుమారుడు. అతని ప్రసవించిన
వెంటనే తల్లి మరణించెను. జ్యోతిష్కులు గౌతముడు గొప్పరాజు

కాని, గొప్ప సన్యాసి కాని కాగలడని చెప్పిరి. ఇరువదియేండ్ల వయస్సున బుద్ధుడు యశోధర అను రాజకన్యను పెండ్లియాడెను. వారికి ఒక కుమారుడు జన్మించెను. ఒకరాత్రి బుద్ధుడు నిద్రించు చున్న భార్యను కుమారుని విడిచి అడవికి వెళ్ళిపోయెను. మానవులు జననము మరణము ముసలితనము అను వానినుండి తప్పించుకొను మార్గమును అతడు అన్వేషింప దొడగెను. చిట్ట చివరికి ఆ ప్రయత్నమున విజయము పొందెను. అప్పటి నుండియు అతడు బుద్ధు డయ్యెను. బుద్ధు డనగా జ్ఞానముకలవా డని అర్థము.

10. పేదరికము మానవుని జీవితమున ఘోరమయిన శాపమని చెప్పుదురు. అందుచే దాని బారి పడకుండ తప్పించుకొనుట కెల్లరును యత్నింపవలయును. కష్టపడి పనిచేయుట, ధనము వ్యర్థముగా ఖర్చుపెట్టకుండుట అను రెండును అందుకు మంచి సాధనములు. అప్పటికిని దారిద్ర్యము తొలగనిచో అది గొప్ప దురదృష్టము. అప్పుడు మానవులు ధైర్యము విడువక దాని నెట్లయిన తొలగించుటకు మరింత గట్టి ప్రయత్నము చేయవలయును.

1. A good man becomes humble as his wealth increases and even when it is lost he does not lose his curage. When the fruits are ripe the tree becomes bent and when the fruits fall it stands erect.

2. There is difference in respect between a king and a scholar. A king is respected only in his country; but the scholar every where.

3. Though a good man occupies a low position he is praised by scholars; but a mean fellow does not recieve respect though he occupies a high position. A lion is considered great though it lives on the ground. But the monkeys are not respected though they live on high trees.

4. To whom does not friendship with good people bestow greatness in the world? Rain water of the streets flows into the Ganges and becomes pure.

5. Siva is the lord of gods. His father-in-law is the king of mountains. Knbera, the lord of wealth, is his dear friend. Ganeswara is his son. Inspite of all this he has to beg fcr his food. Fate is very strong indeed.

6. Though the cloud that gives rain appears black people do not find fault with it. It is a fact that the autumn cloud looks white, but people do not gain anything from it.

7. The crow and cuckoo both are black and there is no difference in colour, but when the spring sets in, the crow is a crow and the cuckoo, a cuckoo.

8, A mean fellow can never get the qualities of a magnanimous person. Can brass become gold though it is melted?

9. To man cow is perhaps the most useful animal. She gives milk which nourishes life from infancy. From milk are prepared various articles of food which are nourishing and tasteful. Butter, ghee, cheese and curd come from milk. Cow-dung is also useful. If fresh it kills germs and in a dried state it serves as fuel. It is also used as manure by peasants.

10. Telugu is a sweet language. Krishnadeva Raya once said "Telugu is the best of the Indian Vernaculars." There are many Sanskrit words in it. Nannaya, Tikkana, Srinadha, Pothana, Peddana and Vemana are some of the greatest poets in Telugu. The works written by them are read by all scholars. They contain many beautiful verses which are full of good ideas, soft words and fine figures of speech. It excels honey in sweetness. A great Tamilian scholar by name Appayya Deekshita said "only people who have performed great penance will be born as Andhras and will be able to speak the sweet Telugu language."



# Glossary of words used in this book

## అ

అంటించు_To set fire; to paste

అంత_Then, afterwards

అంతేకాదు_Not only that

అందగాడు_Handsome man

అందముగా_Beautifully

అక్క_Elder sister

అక్కటా!_Alas!

అక్కడక్కడన్_Here and there

అక్కన్య_That girl

అక్రూరుడు_A great devotee of Krishna

అక్షి_Eye

అగు_To become

అచ్చెరువు_Surprise

అట్లు_Thus

అడకువ_Modesty

అడగు_To bend down

అడుగు_To ask

అతడు_He

అతివలు_Women

అత్త_Mother-in-law

అది_She; it

అధికము_Great

అనటి_Plantain tree

అనారోగ్యము_Ill-health

అనిత్యము_Temporary

అను_To say

అనుజుడు_yonger Brother

అనుదినము_Everyday

అనువు_Convenience; Fitness; Fit; Proper (adj.)

అనుసరించు_To follow

అన్న_Elder brother

అన్నపుబండి_Cart with food

అన్నము_Food

అన్ని_All

అన్వేషించు_To search

అపకారము_Harm

అపహరించు_To steal

అప్పుడు_Then

అబద్ధము_Lie

అభిలాష_Desire

అమరపురి_Heaven

అమృతము–Nectar

అమ్మ–Mother

అమ్మ(గా)వారు–Revered mother (lady)

అమ్ము–To sell

అయిదు–Five

అయిపోవు–To be over; to be finished

అయోధ్య–The capital of Dasaratha

అయ్య–Father; Sir

అయ్య(గా)వారు–Respected gentleman

అయ్యో!–Alas!

అరటిపండు–Plantain fruit

అరపు–Cry

అరుగు–To go

అరుదెంచు–To come

అర్జునుడు–The third of the Pandavas

అర్థము – Meaning; money

అలయిక–Exhaustion

అలవడు–To be accustomed

అలుక–Anger

అల్పము–Little

అల్లుడు–Son-in-law

అవతరించు–To incarnate

అవమానించు–To insult

అవి–They

అశోకము–A kind of tree

అసత్యము–Untruth; lie

అస్తమించు–To set

ఆ

ఆకలి–Hunger

ఆగు–To stop

ఆచార్యులవారు–Respected preacher or teacher

ఆజ్ఞ–Order

ఆట–Play

ఆడు–To play

ఆనపకాయ–Snakemelon

ఆపద–Danger

ఆముదము–Castor-oil

ఆమె–She

ఆయన–He

ఆరంభించు–To begin

ఆరోగ్యము–Health

ఆర్తి–Distress

ఆలు–Wife; woman

ఆవు–Cow

ఆవలించు–To yawn

ఆశ్రమము–Hermitage

ఆసుపత్రి–Hospital

ఆహా! / హా! – Ah!

ఆహ్వానము.Invitation

ఇ

ఇంక_Hereafter; more; henceforth
ఇంగువ-Asafoetida
ఇంచుకించుక_Little by little
ఇంటింటన్-In every house
ఇంద్రజిత్తు-Eldest son of Ravana
ఇచ్చు-To give
ఇటు అటు-Hither and thither
ఇతడు_This gentleman
ఇతరుడు_Other person
ఇత్తడి_Brass
ఇది_This woman; this
ఇనుపకుర్చీ_Iron chair
ఇనుపమార్గము_Railway
ఇనుము_Iron
ఇన్ని_So many
ఇప్పుడు_Now
ఇబ్బంది_Difficulty
ఇరుతెఱంగులు_In two ways
ఇరువది_Twenty
ఇల_Earth
ఇల్లు_House
ఇవి_These
ఇష్టము_Wish; liking; desire

ఈ

ఈకొను_To agree
ఈత_Swimming
ఈమె_This woman
ఈయన_This gentleman
ఈశ్వరుడు_God ; Lord

ఉ

ఉంగరము_Ring
ఉండు_To be
ఉచితము_Proper
ఉత్తమము_Best
ఉత్తరము_Letter ; North
ఉత్పలము_Black lily
ఉత్సాహము_Enthusiasm
ఉదయించు-To rise
ఉనికి_Existence
ఉపకారము_Help
ఉప్పు_Salt
ఊరు_Village
ఊరూరన్_In every village

ఋ

ఋణము_Debt

ఎ

ఎంత-How much

ఎంతమంది-How many

ఎందుకు } For what

ఎందుకై } For what purpose

ఎందుచేత-Why

ఎందువలన-Why

ఎక్కడ } Where

ఎచ్చట } Where

ఎక్కు-To climb

ఎక్కువ-Much ; great

ఎట్ట ఎదుట-At the very front

ఎట్లు-How

ఎడల-In case

ఎడారి-Desert

ఎదుర్కొను-To attack

ఎన్ని-How many

ఎప్పుడు-When

ఎమ్మిక-Bone

ఎరుక-Knowledge

ఎఱ్ర-Red

ఎలమి-Happiness

ఎల్ల-All

ఎల్లప్పుడు-Always

ఎల్లుండి-Day after tomorrow

ఎవతె-Who (feminine)

ఎవ్వరు-Who

ఏ

ఏ-What ; Which

ఏటికి-Why

ఏడు-year

ఏడుచు-to weep

ఏని-If ; or

ఏమి } What

ఏమిటి } What

ఏర్పడు-To become clear ; to form

ఏల-Why

ఏవగించు-To hate

ఐ

ఐదు-Five

ఐన-Ei her; though

ఒ

ఒంటరి-Lonely person

ఒండొరులను-One another

ఒకటి-One

ఒకానొక-Some one

ఒప్పు-Beauty, right

ఓ

ఓట-Defeat; fear

ఓటమి-Defeat

ఓటు-Defeat

ఓడు-To be defeated

ఓదార్చు-To console

ఓపిక-Energy; strength; patience

ఓమనగుంటలు-A kind of play

ఓర-Side

ఓరచూపు-Side glance

ఓరిమి-Patience

ఓరుచు-to endure

ఔ

ఔర!-An exclamatory expression

క

కంచు-Bronze

కంది-Red gram

కంపిల్లు-to shake

కంసుడు-uncle of Lord Krishna

కటా!-Alas

కట్టకడ-At the very end

కట్టు-to bind, to pay

కట్టెండ-very hot sun

కఠినము-hard

కడచు-to pass

కడలి-Sea

కథ-Story

కను-to see

కను-to bring foth

కన్నపుదొంగ-A thief who enters the house by digging a hole in the wall

కన్ను-Eye

కన్నెరికము-Virginity

కపోత వృద్ధము-An old dove

కమసాలి (కంసాలి)-Goldsmith

కమ్మగా-Sweetly

కరకుటమ్ము-A sharp arrow

కరగు-to melt

కరచు-to bite

కరుణ-Kindness

కర్ణుడు-A good friend of Duryodhana

కర్మము-work fate

కఱ్ఱ-Wood, stick

కలసిమెలసి ఉండు-to live intimately

కలిమి-pr sperity

కలియు-to mix, to meet

కలుగు-to be

కళాశాల-College

కల్లరి-lier

కవి-Poet

కవిత్వము-Poetry

కష్టపడు-to do hard work

కాచు-to protect, boil

కాటు_Bite
కాని_But, if
కానిక_offering
కానుక_Present
కాన్పు_Delivery
కాపాడు_to protect
కాఫీ_Coffee
కాబట్టి_therefore
కాబోలును_perhaps
కామధేనువు_Heavenly cow
కాయ_Nut
కాయము_Body
కాలినడక_Walking by foot
కాలు_Leg
కాలుసేతులు_Legs and hands
కాళిదాసు-Sanskrit poet
కావడి_A bangy or yoke
కావున_therefore
కావ్యము-poem
కాశి_the name of a holy place
కించిత్తు_Very little
కినుక_Anger
కీచకుడు_Brother of Sudeshna wife of king Virata
కీడు-Evil, harm
క్రింద–Under
కుంటి_Lame
కుండ-Pot
కుక్క-Dog
కుచేలుడు_Friend of Lord Krishna
కుటిలము_Wicked
కుట్టు-to sew; to bite
కుడుచు-to eat
కుత్తుకబంటి_upto the neck
కుదురు_to settle
కుమారుడు-Son
కుమార్తె_Daughter
కుమ్మరి-Potter
కురియు_to shower
కుళ్ళు-to become Rotten
కూడ_Also
కూడిక_Adding, mixing, meeting
కూడు_Food
కూడు (V)-to meet
కూత_Cry
కూతురు-A daughter
కూనలు_Offsprings
కూరగాయలు-Vegetables
కూరలు_Vegetables
కూరిమి_Friendship
కూర్చుండు_to sit
కూర్మన్న_Name of a male person
కూల్చు_to destroy

కృష్ణుడు_the incornation of Vishnu

కైక_third wife of Dasartha

కైవ్రాలు_to fall aside

కైసేయు_to adorn

కొంచెము_Little

కొండ_Hill

కొంపోవు_to take out

కొట్టు_to beat

కొడవలి_Sickle

కొడుకు_Son

కొదువ_Inferiority

కొను_to take; to buy

కొన్ని_Scme

కొలది_Few; small

కొలను_Lake

కొలుచు_to serve

కోకిల_Cuckoo

కోటి_Crore

కోడలు_Daughter-in-law

కోత_Cutting

కోతి_Monkey

కోదండము_Bow

కోయు_to cut

కోరిక_Wish

కోరు_to wish

కోల_Arrow

కౌసల్య_Eldest wife of Dasarath

క్రూరము_Cruel

ఖ

ఖర్చు_Expenditure

ఖైదు_Jail

గ

గంగ_River Ganges

గండడు_A strong man

గంపెడు_Basketful;

గజము_Elephant

గట్టి_Hard

గడన_Earning

గద_A kind of weapon

గర్భము_Pregnancy

గాంధీజీ_ Mahatma Gandhi, the father of the Indian Nation

గానము_Singing

గాయకుడు_Musician

గారడీవాడు_Juggler

గిలిగింత_Tickling

గీత_Line; drawing

గుజ్జనగూళ్ళు_A kind of play

గుడ్డముక్కలు_Pieces of cloth

గుణము_Quality
గుణవంతురాలు_A woman prossessing good qualities
గురువు_Teacher
గుఱ్ఱము_Horse
గులాబి_Rose
(కూ) గూర్చి_About
గృహము_House
గేయము_song
గొడుగు_Umbrella
గొడ్డుటావు_A barren cow
గొడ్డురాలు_A barren woman
గొలుసు_Chain
గోకు_to scratch
గోడ_Wall
గోను_A kind of plant
గోపాలుడు_Cowherd
గోయి_pit
గోరు_Nail
గౌతముడు-Lord Buddha
గౌరవించు-to honour
గ్రంథాలయము-Library
గ్రహించు-to take; to accept; to understand
గ్రామము-Villag

ఘ

ఘటము-pot
ఘనము-Great
ఘోరము-Terrible

చ

చక్కన-Beauty
చక్కని-Beautiful
చక్రము-Wheel
చచ్చు-to die
చదువరి-Education
చదువు-to read
చపలము-Wavering
చమురు-Oil
చరచు-to clap
చరిత్ర-History
చల్లగా-Coolly
చాకలి-Washerman
చాకిత-Washer woman
చాకు-Knife
చిక్కు-Net; to catch hold
చిగురాకు-Tender leaf
చిట్టచివర-At the very end
చిట్టెలుక-small rat
చిత్రకారుడు-painter
చిత్రము-picture
చినుగు-to be torn
చిన్న-Youngest; small

చిమ్ము-to sprinkle

చిరునామా-Address

చీకటి_Darkness

చుక్క_Star; dot

చుట్టము-Relative

చుట్టరికము_Relationship

చుట్టు-Around

చూచు-to see

చూపు_Sight

చెంచెత-Tribal woman

చెంప-cheek; side

చెన్నుడు_Charioteer of Buddha

చెట్టు-Tree

చెడుగుడు-A game called Kabaddi

చెడ్డ-Bad

చెప్పు-to tell

చెరువు-Tank

చెలిమి_Friendship

చెలిమికాడు-Friend

చెల్లించు-to pay

చెల్లెలు-Younger sister

చెవి-Ear

చేటు-Ruin; Harm

చోడి-A kind of grain

చేత-Action; with

చేను-Field

చేయి-Hand

చేయు-to do

చొక్కా-Shirt

చొచ్చు-to enter

జ

జనకుడు-Father of Sitha

జనుపనార-Fibre of a plant called జనుము

జనులు-People

జరిమానా-penal y

జవరాలు-A young woman

జాంబవంతుడు-Father of Jambavathi wife of Krishna

జాతి-Tribe Caste, nation

జాబు-Letter

జాము-Three hours

జాలరి-Fisherman

జీతము-Salary; Fees

జీలకర్ర-Finnel, commin seed

జీవించు-to live

జీవించు-Living beings

జూదగాడు-Gambler

జూదరి-Gambler

జేనెడు-A space about 7 inches

జోక్యము కలిగించుకొను-to interfere

జ్ఞానము_Knowledge
జ్ఞానవంతులు_Learned people
జ్వరము_Fever
జ్యేష్ఠకుమారుడు_Eldest son
జ్యోతిష్కులు_Foretellers

ట

టక్కరి_A cunning being

డ

డయ్యు_to beome exhausted
డాగు_to hide
డోకు_to vomit

త

తండ్రి_Father
తిండిపోతు_A glutton
తొంబది_Ninety
తగవరి_Judge
తగవు_Justice
తగ్గు_to come down; to decrease
తడవు_Delay; time
తడవు_(V) to touch
తడియు_to become wet
తన్ను_·o kick
తప్పక_Without fail
తప్పుడు_Agitated person
తప్పు_Fault
తమరు_Your Honour
తరగతి_Class
తరువాత_After words
తల_Head
తలచు_to think
తలపు_idea
తలుపు_Door
తల్లి_Mother
తాటక_Demoness killed by Rama
తాత_Grand father
తాను_He; She or it
తామర_Lotus
తాము_They
తాల్చు_to bear
తిక్కన_The great Telugu poet
తిట్టు_to abuse
తిను_to eat
తిన్న_Straight
తియ్యని-(adj) Sweet
తిరిగి_Again
తిరుగు_to wander
తీగ_creeper, wire
తీయు_to take

తుట్టతుద_At the very end

తుమ్ము_to sneeze

తూర్పు_East

తృప్తి_Satisfaction

తెగు_to be cut

తెచ్చు_to bring

తెలియు_to know

తెలివి_Intelligence

తెల్ల_White

తేటి_Bee

తేనె_Honey

తేలు_Scorpion

తేలు_(v) to float

తొడవు _Ornament

తొడ_Thigh

తొడుగు_to wear, to put on, to place on

తొమ్మిది_Nine

తొలి_Prior; first

తోక_Tail

తోచు_to rise; to seem to appear

తోట_Garden

తోటకూర_Leafy vegetable

త్రాడు_Rope

త్రోయు_to throw

ద

దండెత్తు_to wage a war, attack

దంపతులు_Couple

దంపుడు_pounding

దట్టము_thick

దనువు_Mother of Demons

దయ_Kindness

దరిద్రుడు_A poor man

దర్భ_A kind of holy gross

ధర్మము_Righteousness

దర్శించు_to see

దశరథుడు_King of Ayodhya

దాగిలిమూతలు_A kind of p

దాటు_to cross; to violate

దాపుడు_Keeping, storing

దిక్కు_Direction

దిగు_to descend

దీనుడు_A man in distress

దీవన_Blessing

దుఃఖించు_to feel sorry

దుముకు, దూకు_to Jump

దుమ్ము_Dust

దుర్యోధనుడు_Eldest brother of the Kauravas, son of Drutarashtra

దుర్వ్యయము_Squandering
దుష్టము_Bad, wicked
దుష్టురాలు_A bad woman
దూత_Messenger, Ambassador
దూరము_Distance
దూరు_to enter
దెబ్బలాడు_to fight; to quarrel
దేవతలు_Gods, Goddesses
దేవర_Lord
దేవుడు-God
దైన్యము_Humility, wretchedness
దొంగ_Thief
దొంగిలించు_to steel
దొడ్డ_Good
దొడ్డి_Yard
దొర_Lord; Master
దోసెడు_Double handful
ద్వారక_The abode of Lord Krishna
ద్వీపము_Island
ద్రుపదుడు_Father of Draupadi
ద్రోణుడు_Teacher of Pandavas and Kauravas
ద్రౌపది_Wife of the pandavas

ధ

ధనము_Wealth
ధన్యుడు_Blessed man
ధర_Price, cost

న

నకులుడు_Fourth of the pandavas
నగ_Jewel
నట్టనడుమ_At the very middle
నట్టిల్లు_Middle portion of the house
నడక_Gait
నడచు_to walk
నడవడి_Behaviour
నది_River
నానాడు_Day by day; gradually
నమస్కరించు-to salute
నమ్మకము-Belief
నమ్మిక-Belief
నరకము-Hell
నలగు-to become powder
నలుడు-King of Nishadha
నల్ల-Black
నల్లి_Bug
నశించు-to destroy
నష్టము_Loss
నాగలి_Plough
నాచు_Water plant, Fungi

నాటకము_Drama

నాడు_Day

నాన్న_Father

నామము_Name

న్యాయమూర్తి_Judge

నాయకుడు Leader

నారదుడు_Son of Brahma; a sage who is Fond of quarrels Devotee of Vishnu

నిందించు_to blame

నిట్టూరుపు_Long sigh

నిద్దపుటద్దము.Smooth mirror

నిద్ర_sleep

నిద్రించు_to sleep

నిన్న_Yesterday

నిప్పు_Fire

నిప్పుక_Spark of fire

నిమిషము_Minute

నిర్మలము_pure

నిలుచు_to stand

నివసించు_to live

నీవు_Thou

నూనె_oil

నూయి-Well

నెయ్యపుటలుక_Anger with love

నెయ్యుడు_Firend

నెర-perfect

నెల_Moon, month

నేడు_To-day

నేత_Weaving

నేను_I

నేరము_Crime

నేరుచు_to learn

నేర్పరి_Skilful person

నేర్పు_Skill

నేల_Floor

నైపుణ్యము_Skill

నొచ్చు_to feel pain

నోరు_Mouth

నౌకరు_Servant

ప

పంచ_Five

పంట_crop

పండు_to become ripe to yield the crop

పండ్రెండు_Twelve

పంతులు (వా) గారు_Teacher

పందొమ్మిది_Nineteen

పంపకము_sending; Division

పచ్చ_Green

పట్టణము_Town

పడమర_West

పడవ_Boat
పడు_to fall
పది_Ten
పదునాలుగు_Fourteen
పద్మము_Lotus
పద్యము_Verse
పనస_Jack fruit
పని_work
పన్ను_Tax; Tooth
పరాకు_oversight; carelessness
పరాజయము_Defeat
పరీక్ష_Examination
పరుండు_to lie down
పరుగెత్తు_to run
పర్ణశాల_Hut covered with leaves
పలువురు_Many
పల్లు_Tooth
పవిత్రము_Sacred
పశువు_Beast
పసుపు_Turmeric; saffron
పసులు_Cattle
పాండవులు_Sons of king Pandu
పాటు_Fall
పాఠము_Lesson
పాడు_to sing
పాడుచేయు_to destroy
పాణి_Hand
పాదములు_Legs
పాపంగ_to delete
పాపరేడు_king of the serpents
పాపి_Sinner
పాము_snake
పారిపోవు_to run away
పార్వతి_wife of Lord Siva
పాలు_Milk
పిందె_Tender nut
పిచ్చివాడు_Mad man
పిడికెడు_Handful
పితృభక్తుడు_Devoted to father
పిన్ని_Mother's younger sister
పిమ్మట_After wards
పిలుచు_to call
పిల్ల_Girl, young one
పిల్లి_cat
పుట్టినిల్లు_house wher one is born
పురుగు_Insect
పురుషుడు_Man
పుల్లని_Acidic
పుష్పము_Flower
పుస్తకము_Book
పూచు_to flower
పూజ_Worship

పూజారి_Worshippe
పూజించు_to worship
పూదండ-A garland of flowers
పూదోట-Garden of flowers
పూను-to strive
పూర్ణిమ-Fullmoon day
పూర్వము-Long ago, before
పెంచు-to Nourish
పెండ్లము-Wife
పెంపుడు-Nourishing
పెక్కు-More, many
పెట్టుపోతలు-Feeding; charity
పెద్ద-Eldest, big
పెరుగు-to increase
పెసలు-Black gram
పేద-poor
పేదరాలు-A poor women
పేదరికము-poverty
పేను-Louse
పేరిమి-Greatness
పేరురము-Broad chest
పొందు-to get
పొగ-smoke
పొదరిల్లు-A bower
పొరుగు-Neighbouring
పొలుపు-Beauty
పోక-Going
పోటు-stroke; pain
పోత-pouring
పోయు-to pour
పోరు-to fight
పోలిక-Resemblance, comparison
పోలీసు-police
పోవు-to go
పోషించు-to nourish
ప్రజలు-people
ప్రతిదినము-Everyday
ప్రముఖుడు-An important person
ప్రయాణము-Journey
ప్రయాణమగు-to start
ప్రవహించు-to flow
ప్రసవించు-to bring forth
ప్రార్థించు-pray
ప్రేవసజ్జ-Basket made of cane
ప్రేమించు-to love
ప్రోచు-to protect

ఫ

ఫలము-Fruit

బ

బంగారు-Gold

బండారి_cashier
బండి_cart
బంతి_Ball
బకాసురుడు_A demon called Baka, killed by Bhima
బట్ట_cloth
బట్టబయలు_very open
బడి_School
బయలు_out side place
(బల)రాముడు_Elder brother of Lord Krishna
బలవంతముచేయు_to force; to insist
బలవంతుడు_Strongman
బల్ల_Table
బహుమానము_present; prize
బాణము_Arrow
బాలిక_Girl
బాలుడు_Boy
బాలెంతరాలు_Woman in child bed
బావ_Brother-in-law, sister's husband or wife's brother
బిగ్గర_Loud
బిడ్డ_child
బియ్యము-Rice
బీదరాలు_A poor woman
బుట్ట_Basket
బుద్ధుడు_Founder of Budhism
బేరగాడు_Buyer
బేహారి_Merchant
బొంకు_Falsehood
బొమ్మలపెండ్లిండ్లు_Marriages of toy's, A kind of play
బోధించు_to teach
బోయత_Tribal woman
బ్రాహ్మణుడు_A man in Brahmin caste

భ

భక్తుడు_Devotee
భజన_worship
భయంకరము_Fearful
భయము_Fear
భరతుడు_Son of Kaika; brother of Rama
భర్త_Husband
భవనము_palace
భార్య_Wife
భావించు_to think
భాసిల్లు_to shine
భీముడు_Second son of king Pandu
భూమి_Earth
భూమీశుడు_Kin

భేదిల్లు_to break
భోగము_Pleasure, Enjoyment
భోజనము_Dinner
భ్రమ_Illusion

మ

మంచము_cot
మంచి_good
మంట_Flame
మగడు_Husband
మగుడు_to return
మచ్చ_spot
మచ్చరి_Envious person
మడుగులు_Washed clothes
మతిమంతుడు_Intelligent man
మధుర_A holy city
మధురము_Sweet
మనము_You and I
మనసు_Mind
మను_to live
మనుచు_to nourish; to patronise
మనుమరాలు_A grand daughter
మనువు_code maker
మనుష్యులు_people
మన్నన_Regard
మబ్బు_cloud
మరదలు_Wife of the younger brother or wife's younger sister
మరది_Husbands, younger brother
మరణించు_to die
మరపు_Forgetfulness
మరియు_More over
మరునాడు_Next day
మలినము_Dirty
మహాత్ములు_Great people
మహాపాపము_Great sin
మహి_Earth
మాఘము_Name of the 11th Month
మాట_Word
మానవులు_Human beings
మాను_to desist; to give up
మామ_Father-in-law; uncle
మామిడి_Mango
మార్గము_path
మాలెత_Low caste woman
మాసము_Month
మిండడు_A paramour
మినుపరొట్టె_Bread made of black gram
మీగడ_cheese
మీద_on

మీను_Fish
మీరు_You
మీసము_Moustache
ముక్క-piece
ముక్కిడి_Noseless
ముక్కు-Nose
ముగియు_to end
ముత్యాలు-pearls
ముదిమి-old age
ముద్దరాలు_innocent lady
ముద్దు_Kiss, (Adj) Dear
ముని_Sage
మునుగు_to drown
ముల్లు_Thorn
మూగు_to cluster
మూడు_Three (V) to happen
మూత_Covering
మూయు_to shut
మూర_lower arm; Acubit
మూలుగు_to sigh
మృగము_Animal
మృదులము } Soft
మృదువు } Soft
మెచ్చు-to praise
మెడ_Neck
మెప్పు_praise
మెలకువ_Awakening
మెల్లగా-slowly
మేత_Grazing
మేనత్త_Father's sister
మేపు_to feed; to graze
మేము_We
మేయు_to graze
మేలిమి-Goodness
మేలు_Good
మేలుకొను_to wake up, to get up from sleep
మైలు_Mile
మొన్న_Day before yesterday
మొరుగు_to bark
మొలక_tender plant
మోక్షము_Salvation
మోచు_to carry
మోసగించు_to deceive
మ్రాను_Tree
మ్రింగు-to swallow
మ్రోత-Sound

## య

యత్నించు_to try
యథాశక్తి_Not going beyond one's capacity

యశోద_Nanda's wife who brought up Lord Krishna
యశోధర_Wife of Lord Buddha
యాచకుడు_Begger
యుక్తుడు_proper
యోగి_Saint

ర

రంగు_colour
రంజిలు_to be pleased
రంపము_saw
రక్షించు_to protect
రత్నపుటుంగరము_A diamond ring
రథము_Chariot
రాక_Coming
రాక్షసుడు_Demon
రాజిలు_to shine
రాజ్యము_Kingdom
రాత్రి_Night
రామదూత_Messenger of Rama
రాముడు_Eldest son of king Dasaratha
రాయి_stone
రాలు_to wither; to fall down
రావణుడు_King of Lanka
రూపము_form
రూపాయి_Rupee
రెండు_Two
రేడు_A king
రేను_A kind of tree
రేపు_Tomorrow
రేయి_Night
రైలు_Train
రొమ్ము_chest
రొమ్ముబంటి_up to the chest
రోకలి_Pounding rod
రోగి_patient
రోత_Hatred

ల

లంకిణి_A Rakshasa woman; presiding over Lanka
లక్ష్మణుడు_Younger brother of Rama
లక్ష్మి_Goddess of prosperity
లఘువు_Light
లచ్చి_Name of a female
లాభము_Gain
లెక్క_Sum
లేక_or
లేగొమ్మ_Tender branch

లేచు_to get up
లేడి_Deer
లేదూడ_A lender calf
లేమి_poverty
లోపల_In
లోభి_Miser
లోహము-Metal

వ

వంకర_Curved
వంటకము_Brinzal
వంటకాలు_cooked food
వండు_to cook
వందనములు_Salutes
వగలాడి_A beautiful lady
వచించు_to speak
వచ్చు_to come
వట్టి_Mere
వడి_quickness
వడ్రంగి_Carpenter
వదిన_Elder brother's wife
వదులు_Loose
వనము-Forest
వన్నె_Colour
వన్నెలాడి_A graceful lady
వయస్సు_Age
వరద_God, who gives boons
వరము_Boon
వరి_Paddy
వర్ణించు_to describe
వర్ణము_colour, caste
వర్తకుడు_Merchant
వర్ధిల్లు_to prosper; to increase
వల_Net
వలచు_to love
వలపు_Love
వలయునవి_wanted things
వలె_As; Like
వస్తువు_Article
వాక్యములు_Sentences
వాడిమి_Sharpness
వాడు_He
వాడుట_Use
వాన_Rain
వానరుడు_Monkey
వాపు_swelling
వారు_They
వార్త_News, message
వాలి_King of the monkey Fribe
వాల్మీకి_The author of Ramayana in Sanskrit

వాలిడి_Tail less
వింత_peculiar
వికృతము_ugly
విగ్రహము_Idol
విడుచు_to leave
వినయసంపద_wealth of modesty
వినికి_Hearing
విను_to hear
విభీషణుడు_younger brother of Ravana
విరుగు_to break
విలుకాడు_A bowman
విలువిద్య_Skill in using the bow and the arrows
విల్లు_Bow
వీచు_to blow
వీడు_this man
వీపు_Back
వీరు_these persons
విత్తనము_Seed
విదురుడు-Brother of Dritharashtra
విద్య_Learning
విధాలు_Types
వీవన_Fan
విశ్రమించు-to take rest
వీసె_A weight 120 Tolas
వృక్షము_Tree
వెంట_Along with
వెంటనే_immediately
వెండి_Silver
వెదకు_to search
వెరవిడి_A person without skill ro intelligence
వెల_price; cost
వెలయు_to shine
వెలియు_to stop
వెలువడు_to come out
వెళ్ళు_to go
వేకువ_Early morning
వేగ_speed
వేటకాడు_A hunter
వేడి_Hot, heat (N)
వేపచెట్టు_Margosa tree
వేరు_Different; root (N)
వేలుపుటావు_cow of the gods
వేళ_Time
వైద్యుడు_Doctor
వ్యర్థము_useless
వ్రాత_writing
వ్రాయి_Letter
వ్రాయు_to write
వ్రేటు_stroke
వ్రేత-shepherd woman
వ్రేలు_Finger

శ

శకుని_The great gambler; uncle of Duryodhana
శత్రుఘ్నుడు_younger brother of Rama and Bharatha
శబరి-A woman devotee of Rama
శాక్యవంశము_The sakya dynasty in which lord Buddha was born
శాపము_Curse
శిక్షించు_to punish
శిల_Stone
శివరాత్రి_Hindu festival in honour of Siva occuring in the month of Magha
శిష్యుడు_Disciple
శుద్ధోదనుడు_Father of Lord Buddha
శుభము_Good
శూలము_weapon of Lord Siva
శోకము_Sorrow
శౌర్యము-Valour
శ్రీనాథుడు_Name of a great Telugu poet
శ్రేష్ఠుడు-Best man

స

సంగీతము-Music
సంత_Fair
సంపద_wealth
సంపెంగ-A kind of flower
సంభవించు_to happen
సంభారము-provision
సంరక్షించు_to protect
సంస్కృతము_Sanskrit
సంహరించు_to kill
సత్యభామ-Wife of Lord Krishna
సన్యాసి_Sage
సభ_Assembly
సభ్యుడు_Member
సమకూర్చు-to collect
సమానుడు_Equal person
సముద్రము-Sea
సరసపుమాట_pleasing word
సర్కసు_Circus
సస్యము-Crop
సహదేవుడు-Last of the Pandavas
సాందీపని-Teacher of Balarama and Krishna
సాధనములు-Instruments
సాధువు_Good
సాయము_Help
సాలెత_Weaver woman
సావిత్రి_wife of Satyavan
సింగపుపిల్ల-Lions cub
సిగ్గరి-Bashful man or woman

సినిమా_Cenema
సీత_wife of Rama
సుందరము_Beautiful
సుఖము_Happiness
సుభద్ర_wife of Arjuna
సుమా_Indeed
సుమిత్ర_Second wife of Dasaratha
సులభము_Easy
సెలవు_Holiday
సేతువు_Bridge, causeway
సేన_Army
సేవ_Service
సేవకుడు_servant
సైకిలు_Cycle
సొంతము_Own
సొమ్ము_Money
స్వర్గము_Heaven
స్వాములవారు_saint
స్వార్ధము_selfish
స్థిరము_Firm
స్తుతించు_to praise
స్నేహితుడు_Friend

హ

హంస_Swan
హింస_Violence
హరి_God Vishnu
హాయిగా_Happily
హారము_Necklace
హిమాచలము_ Himalaya mountain
హీనము_Mean
హృదయము_Heart
హెచ్చు_to increase

—: o :—